









# నాటకాలు

భక్తి,జ్ఞాన,పురాణ,జానపద

# తుకారాం







## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015172

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**SaiRealAttitudeManagement**(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions |
Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

Bhavani Grandhamala. 4.

# తుకారాం

(అయిదంకముల నాటకము)



గ్రంథకర్త:

కలవకొలను జయరామారావు.

(Author of Suvarnakesari Krishnasena, Kaliyugadarpanamu
The History of Gandikota, The Hero of Renad, Etc.)



ముద్రాపకులు:

వాణీ ముద్రాక్షరశాల, బెజవాడ.



మొదటికూర్పు: 1000.

1925

 [వెల రు 0-12-0 లు.

# ఇందువచ్చు పాత్రలు.

## పురుషులు.

సూత్రధారుఁడు, మారిషుఁడు — ప్రస్తావకులు

తుకారాం—నాయకుఁడు

గొత్తుల జీవన్న, టక్కరిసుందరము, వాసుదేవుఁడు — అల్లరి బాలురు

సుబుద్ధి—బాలుఁడు

మాస్వాజీబాబా—మతాధికారి

కల్లుకదిరిప్ప—, భంగిభద్రుఁడు—, మదత్ మారిగాఁడు — మాస్వాజీబాబా శిష్యులు

సేవకుఁడు—మస్వాజీ పనివాఁడు

బంగారు గుప్త, కుశాల్ రావు — విటులు

రామేశ్వరభట్టు—మతగురువు

సేవకుఁడు—రామేశ్వరభట్టు శిష్యుఁడు

శివాజీ—మహారాష్ట్రరాజు—తుకారాం శిష్యుఁడు

## స్త్రీలు.

జిజీబాయి—తుకారాం భార్య

సర్వహారి—వేశ్యమాత

పద్మ—సర్వహారి పెంపుడు కూతురు

# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 2 | తాకారాం | తుకారాం |
| 9 | 13 | అరాంగి | అర్ధాంగి |
| 23 | 8 | దారిద్య | దారిద్ర్య |
| 24 | 23 | జీపనము | జీవనము |
| 25 | 13 | బెండు | జెండు |
| 29 | 1 | యుడం | యుండ |
| ” | 13 | సమ్మతించున్నది | చున్నది. |
| ” | ” | తించిన | సమ్మతించిన |
| 27 | 18 | ప్రసంగించుట | ప్రసంగియుట |
| 40 | 5 | కడిదర్ప | కదిరప్ప |
| 44 | 9 | యింటినీ | యుంటినీ |
| 60 | 13 | అప్పుడాయన | అప్పుడాయన |
| 61 | 21 | తీరుదు | తీరును |
| 62 | 23 | మునను | ములను |
| 64 | 26 | ముల | కముల |
| 68 | 19 | దేవాలయమునస | దేవాలయమున |
| 68 | 22 | వురుషుండు | పురుషుండు |
| 69 | 21 | కొండ | కొంచ |
| 71 | 1 | డిని | డిన |
| 73 | 15 | బలిమిమ్తై | బలిమిమై |
| ” | 26 | పరూక్రమ | పరాక్రమ |
| 80 | 2 | టకు | నుటకు |
| ” | 6 | రొువ | యొక |
| ” | 7 | సేక | సేవ |
| 84 | 17 | వామేశ్వ | రామేశ్వ |
| 85 | 15 | నాను | నాకు |
| 88 | 10 | మహానీనితో | మహానీయునితో |

# విజ్ఞప్తి.

నేను నా ప్రథమగ్రంథమును ముద్రించుటకు విజయవాడకేగి యుండుతఱి, ఆపురమునందున్న మైలవరము బాలభారతీ సినిమావారు "తుకారాం" చరిత్రను నాటిసినిమాలోఁ జూపుచుండ నద్దానిం జూడనెంచి నేనుగూడ వెళ్లి కన్నులపండువుగాఁ జూచి యానందించుచు, అప్పుడే దానిని నాటకరూపమున రచించి తీరవలయునని సంకల్పించుకొని, తత్ప్రదర్శనము ముగిసినతోడనే విడిదికేతెంచి మరునాడె తుకారాంచరిత్రను దృశ్యప్రబంధముగ రచించుటకుఁ బ్రారంభించితిని.

ఈ గ్రంథమును తగినటుల మార్పులనుజేసి భక్తులకును పామరులకును మనోహ్లాదము గలిగించునదిగా నుండునటుల వ్రాసితిని. నాచేఁ జేయఁబడిన మార్పులకును సినిమాలోఁ బ్రదర్శించిన దానికిని యెక్కువ భేదము లేదు గాని కొన్నికొన్ని సన్నివేశములను మాత్రము సృష్టింపవలసివచ్చెను. ఈ నాటకమును 1923 వ సంవత్సరమున వ్రాసితిని. అనగా యిప్పటికి ఒకటిన్నర సంవత్సరముకిందట రచించితిని. తుకారాం కథను యింతకు ముందెవ్వరు నాటకముగ వ్రాయనందునను, నాకుఁగూడ కథ నూతనమైనందునను లోపము లుండకమానవు. ఈ గ్రంథమును వ్రాసినతోడనే బ్రకటించుటకు ధనలోపమువలన వీలుపడక ఆలస్యముగ ముద్రింపవలసివచ్చెను. ముద్రణసమయమున నేను సమీపమున లేనందున పొరబాటులు జరిగినవి. ద్వితీయముద్రణమున వాటిని సవరించుకొనెదను. భాషాభిమానులు గుణమును మాత్రము గైకొని నన్నింకను బ్రోత్సాహపరుపఁ బ్రార్థించెద.

జమ్ములమడుగు,<br>24-12-1925.

గ్రంథకర్త,<br>కలవటాల జయరామారావు.

# పండితాభిప్రాయము.

---

తే॥ గీ॥ తగ "తుకారాము" చరిత్రను • సొగసుమీఱ
వ్రాసి వెలయించె నిల జయ • రామరావు
కలవటాలకులంబు వి • ఖ్యాతినొంద
భక్తిరేకెత్త నాంధ్రప్ర • పంచమందు॥

తే॥ గీ॥ ఇది చరిత్రాత్మకంబయి • సొంపునింపు
మీఱునట్లుగఁ గల్పన • లూరఁజేసి
లోకమును సంతసాంబుధి • లోన ముంచె
నిట్టులే నాటకములాడ • నెసఁగుభక్తి॥

పిఠాపురం,
6-11-1925.

ఇట్లు,
ఉమర్ ఆలీషా.

---



శ్రీరస్తు.

# తుకారాం.

## నాంది.



శ్రీ రాముఁ నిరతంబు గొల్చెడు మహా •
శీలుఁ "తుకారాము"నిఁ
జాతుండౌ కడుండు "పద్మ"నా బరగు నే •
శ్లోకబంధ్ నంచింపఁగా
ధీరుండై పరిహార సల్లు సనె నా •
సశాలి వీక్షించి తాఁ
జేరం బ్రోచిన "పండరీపురప నా •
జీనాకు"నేలుఁ మిముఁ

(పుష్పాంజలి సమర్పించి నిష్క్రమించును)

ప్రవేశము:—సూత్రధారుఁడు.

సూత్ర—మా మార్గస్థునికి కబురంపి చాలఁ వడమైనది. ఏలనో యింకను రాకున్నాఁడు కార్యక్రమముల యందించుకఁ దోడ్పడునను యాశ యుండెను. ఆయాశ నిరాశఁ జేయునేమో.

మారి—(లోపలినుండి త్వరితగతి నభినయించుచు) బావా! నన్నిచటి కింత త్వరితముగ రమ్మనుటకుఁ గారణమేమని యడుగవచ్చునా?

సూత్ర—నాటకమును ప్రదర్శింప నెంచి నా కేమైనఁ దోడ్పడుదువేమో యని పిలిపించితిని.

సూత్ర—అయిన నేమి?

మారి—అతఁ డే గ్రంథము వ్రాసినను సంఘ విషయముల మిక్కిలి తీవ్రముగఁ జర్చించుచు, దుర్మార్గుల గుట్టుఁ బయటఁ బెట్టునని కొందఱు నిందించు చుండ వింటిని. కనుక ఆతనిచే రచింపఁబడిన నాటకమును బ్రదర్శించిన మనము గూడ నిందాపాత్రుల మగుదు మేమో.

సూత్ర—వాఁ దూషణలకుఁ బాత్రుల మైనను సంఘసేవఁ జేసిన వార మగుదుము గదా? అందునను మనకే జయము.

మారి—గ్రంథకారుఁడు కావలయునని ప్రత్యేక వ్యక్తులపైఁ గత్తిఁ గట్టినాఁడను నట్టి వదంతిఁ గలిగించిన దుష్టబుద్ధులు మనపై మాత్రము తమదుష్టబుద్ధిని బ్రయోగింపకుందురా?

సూత్ర—బాగున్నది. నీ పలుకులఁ జూడ కవులు గ్రంథరచనను, మన బోటి వారలు నాటక ప్రదర్శనమును మాన వలసిన దేనా? అటుల

తే. గీ. బూతు లను వ్రాసె మాపైన • బూని యనుచుఁ
గ్రొత్త నిందలఁ గల్పించు • కుమతులకును
దెలివి వచ్చెడి రీతిగాఁ • దెలుపఁ గవియు
వాని కరయంగ నిందాస్త్ర • వంబు గలదె. 4

అది మన పనిగాదు. ఇట్టి నాటకముల నాశియె తీరవలసి యున్నది. అటులఁ బ్రదర్శింపకఁ బోతిమా; కవికియపకృతి యాచరించిన వారమగుదుము. అది యటుండ సంఘమున కపరాధము గూడఁ గావించిన వార మగుదుము సుమా.

మారి—అది యటుండనిమ్ము. కవి తన చిన్న వయసున నే గ్రంథ రచనమునకుఁ గడంగెను. అదిగాక గొప్ప పండితుఁడును గాదు. నాటకము రసవంతముగ నుండునో లేదో.

సూత్ర—కవి తానె గొప్ప పండితుఁడనని విజ్ఞప్తిగ లేదే. ఓహో! మరచితిని. కవి తన విజ్ఞప్తి నిటుల విన్నవింపుమని నుడివినాఁడు.

తే. గీ, తల్లి గర్భమునందుండి • ధరణిఁ బడిన
వెంట రాదెట్టి విద్యైన • విబుధు లార!

పండితుఁడగాను నాకవి • త్వంబులోనఁ
దప్పులుండిన సవరింపఁ • దలప మిమ్ము. 5

అదియునుంగాక నాపాండిత్యమును జాటుటకు వ్రాసినవాఁడను కాను.

తే. గీ. ఆంధ్ర వాణికి సేవ నే • నాచరించి
ధన్యు లగువారి రాశిలోఁ • దనరు నట్టి
నాసతో భక్త చరితంబు • వ్రాసి నాఁడ
చంద్రునకు నూలుపోగను • చందమునను. 6

కావున పండితులు రసమునే గ్రహింతురు. నాటకము రసవంతముగ నుండదని నీ వెటులఁ జెప్పఁ గలవు. ఇది దృశ్య ప్రబంధము. ప్రదర్శించిన వెనుకఁ గదా దాని కౌశల మెఱుంగఁ బడునది.

మారి— బావా! వేద వేదాంగ పారీణులును, నవరస కవితాధోరణి గల మహాకవి పుంగవులును, సంగీత పాండితి పటిమఁగల గాయకులును, అన్య భాషలయం దారి తేఱిన నవనాగరికులును, గలిసి క్రిక్కిఱిసి యుండెడి యీ సభను మనము మెప్పింపఁ గలమా?

సూత్ర—అది నేనెట్లుఁ జెప్ప గలను? అందు కొఱకు ముందే సభ్యులకు మన విన్నప మెఱిగించెదము. (సభను దిలకించి) సభాసదులారా!

తే. గీ. మేము పొరపాటుఁ జేసిన • మీరు కవిని
జాల దూషింపఁ బనిలేదు • సరసులార!
తప్పుఁ జేయని వారలు • ధరణిఁ గలరె?
గాన మాదోసఁగులదిద్ది • గావ రయ్య 7

(అనిపోఁబోవ)

మారి—ఆగు మాగుము.

తే. గీ. చప్పటులు కేక లిలలఁ • జాల వేయు
వార లుండిన దయను మా • బాగుఁ గోరి
యూర కుండుట యేఁగాక • మీరు భక్త
వరుని చర్యల నేరిచి • బాగు పడుడి 8

(ఇరువురు నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన



# తుకారాం.

## ప్రథమాంకము

—* ప్రథమ రంగము *—

ప్రవేశము:—తుకారాంసేట్ తనగృహమునపుస్తకమునుముందిడుకొని.

తుకారాం:—

సీ. సీతామనోహరు • సేవక మందారు
పన్నగశయను నా • పన్న హరణు
సురవైరి సంహారు • దురిత విదారు బం
ధుర చక్ర ధారు సుం • దర విచారు
ఇందీవరశ్యాము • సుందర గుణధాము
గోపికా వల్లభు • కూర్మ రూపు
వరహావతారు సం • భరిత లోకాధారు
క్షీర సాగరవాసు • స్థిర విలాసు
తే. గీ. కంస నాశను గిరిధరుఁ • గనక చేలు
నార్త రక్షణు ననురూపు • నాల కాపు
భూరి గుణసాంద్రు వైకుంఠ • పురనివాసు
పండరీపుర నాథు నే • భక్తిఁ దలఁతు 9

లక్ష్మీవల్లభా!— (అర్థోక్తి)

ప్రవేశము:— జీజీబాయి—

జీజీబాయి—నాథా!— (అర్థోక్తి)

తుకారాం—ప్రాణేశ్వరీ! గృహ కృత్యముల ముగించుకొని వచ్చితివా? రమ్ము కూర్చుండుము. హరిభజన సేయుదము.

జీజీబాయి—నాథా! మీకు రానురాను ప్రపంచ జ్ఞానము శూన్యమగుచున్న దే. గృహ కృత్యముల నెఱవేర్చుటకు మీరు వెలుపలికేగి కావలసిన వస్తువులను సేకరించుకొని వచ్చిన గదా సాగును.

తుకారాం—ప్రేయసీ! నీవు భగవంతుని ధ్యానించుటకు రాలేదా? నీకేమైనం గావలసియున్న యంగడి వీధికిం బిల్ల వాండ్రను బంపి తెప్పింపక యిట కేతెంచి దైవ ధ్యానమున కంతరాయములం గలిగించెద వేల?

జీజీబాయి—ప్రాణేశ్వరా! భగవంతుని భజించుచుండ మిమ్ముల వలదని చెప్పు నంతటి పాపిని గాను. భోజనమునకుం గావలసిన వాటిని దెచ్చి పిమ్మట మీ యిష్ట ప్రకారము హరిని భజింపుడు. అఖిల జీవుల కాధార మన్నమే గదా? ఆహారము లేక యేప్రాణియు జీవింపం జాలదు. అట్టి యెడ యింటిలో బిడ్డలు "అన్నమో రామచంద్రా యని" విలపించు చుండ మీరిట భజన మొనరించు చుంటిరి రేక నన్నమెటుల రాం గలదు.

తుకారాం—కాంతా! అన్న మన్నమన్న మని కలువరించెద వేల? ఆపరంధాముని నమ్మిన మన కేమి తక్కువ కాంగలదు.

జీజీబాయి—నాథా! మీ బుద్ధి మీ స్వాధీన మందు లేనటు లున్నది. ఊరక యింటిలోం గూర్చుండి అన్నము రావలయు ననిన నెటుల రాంగలదు.

తుకారాం—తే॥ గీ॥ అడవి పక్షికి చీమ కా • హార మెవండు
తప్పు కిచ్చుచు నున్నాండో • దయందలిర్ప
ఆతండేవచ్చి యొసంగును • భీతి వలదు
చేయు చుండుము హరిసేవ • చిత్త మలర 10

జీజీబాయి—మనము చేయవలసిన ప్రయత్నములం జేసి పిదప దేవుం డిచ్చు ననిన యొకింత బాగుండెడిది. అడవి పక్షులు చీమలు

మొదలగునవి తమ శక్తి కొలఁదిఁ బోరాడిన యాహారము లభించును గాని యూరకుండిన దొఱకునా?

తుకారాం—చిత్త చాంచల్యము మాని దేవుని భజించిన యాకలి దప్పులు గలుగవని దెలిసి కొనుము.

జీజీబాయి—నాథా! మేము మీవంటి స్థిర చిత్తులము గాము. మీరు పాండురంగని నమ్మి నటుల మేము నమ్మఁజాలము. బాలురు ఆకలియని యేడ్చుచుండ నేను చూడఁజాలను. మన పుత్రు లితరుల పిల్లలను జూచి వారు ధరించినట్టి యుడుపులను సొమ్ములను దెచ్చి యిమ్మనుచుండ నేను జవాబుఁ జెప్పఁజాల కున్నాను. నాకు మిమ్ముల సొత్తులఁ జేయింపుడనియు, విలువగల జరీ వస్త్రములఁ దెచ్చి యియ్యవలసిన దనియు బాధించుట లేదు. అందఱకుఁ గడుపునిండ యాహారము లేకున్న నెట్లు? మీ యిష్టము ఆ పిల్లల యిష్టము. నేనీ కాపురముఁ జేయఁజాలను.

తుకారాం—ప్రేయసీ! బాగుగ వినుము. సంసార మను నదొక మహా సముద్రము. ఆ సముద్రము నీదుటకు ప్రతి గృహస్థునకు భగవంతుఁడు భార్యయను నావ నొసంగి యున్నాడు. సంసార సాగరమున నుండి నన్నాళ్లు, ఆలని, పిల్లలని, ధన ధాన్యములని, భూములని లేని పోని గొడవలలోఁ జిక్కి వర్తిపించు చుందురు. అట్టి సమయమున ధర్మ వర్తను రాలగు సహధర్మిణి యుండిన నీ మహా సముద్రమగు సంసారమే స్వర్గతుల్య మగును. అటులఁ గాక

సీ॥ బహు సాధువై యున్న • పసలేని వాఁడని
మిగులఁ గృతఘ్నయై • మెలఁగు నట్టి
పట్టు కోకలు మఱి • బంగారు నగలు కా
వలెనని పైఁబడి • బాదునట్టి
ఎంత గడించిన • నింతయేనా యని
మిడుకుచు నితరుల • మెచ్చునట్టి

నాథుని ధనమెల్ల • నాన్నగారికిఁ జేర్చఁ
బుట్టినిల్లును జేరఁ • బోవునట్టి
తే॥ గీ॥ భర్త దండింప నూతికిఁ • బారునట్టి
నూర్మ్మ భర్తను విడిచి తాఁ • గుడుచునట్టి
నాతితోఁ గాపురముఁ జేయ • నరక మగును
స్వర్గ ధామము గాఁబోదు • సన్ను తాంగి. 11

జీజీబాయి—మనోహరా! సంసారమును స్వర్గతుల్యముఁ జేయుటకు గృహిణి యొకతెయె (అర్థోక్తి)

తుకారాం—తెలిసెను తెలిసెను. నీయూహాయు నాలోచింపఁ దగినదియై యున్నది. వినుము. అదియుఁ జెప్పె

సీ॥ అగ్ని సాక్షిగఁ గొన్న • యతివను బోనాడి
పర కామినుల పంచఁ • బడెడు వారు
అర్ధాంగిఁ గొంపోయి • యన్య భామినులకు
దాసిగా నియమింపఁ • దలఁచు వారు
నలపించు శక్తి నీ • కలవడ లేదని
చానఁబో నాడఁగా • జాలు వారు
సాధ్వి పతివ్రత • సతి తన కుండఁగా
రెండవ సతిని న • రించు వారు
తే. గీ. లేని తప్పులఁ జైనిడి • లేశ మేని
కరుణ లేకుండ భార్యలఁ • గష్టపెట్టు
వార లున్నారు పదికోట్లు • వారిజాక్షి
పసుల కింకెను హీనమై • బ్రతుకు వారు. 12

ఇటువంటి పురుషు లుండిన సంసారముఁగూడ నరక మనఁబడును. అనుకూల దాంపత్యము లేకున్న చో ప్రతి సంసారముఁ గూడ యవమానముల పాలగుటయేఁ గాక, అడుగంటక మానదు. అందులకే వివాహములఁ జేయఁబోవు వారు దంపతుల అన్యోన్యాను రాగంబులఁ బరీక్షించుట మన పూర్వీకుల పద్ధతి.

జీజీబాయి—నాథా! పూర్వీకుల పద్ధతి యంటి రేల? ఇప్పుడు మాత్రము?

తుకారాం—ఇప్పుడా!

తే. గీ. కఱకు టమ్మునఁ గుత్తుకఁ • దఱుగు నటుల
ముసలితొత్తుల కిత్తురు • పుత్రికలను
బాలుఁ ద్రాగెడి బుడుతలఁ • బాపి జనులు
కనవె నీవింకఁ గలియుగ • కాల రీతి. 13

జీజీబాయి—నాథా! అలాటి వివాహంబులు మన దేశమునకు లేని ముప్పులను దెచ్చుననుటలోఁ దప్పేమియు నుండదు గదా?

తుకారాం—తప్పేమియు లేదు గాని దుర్మార్గులు నిందింతురు. ఇటీవల మన దేశమునఁ గొన్ని సంఘ లోపములు దలలెత్తుచున్నవి గాని వాటిని సంస్కరించు వార లింకను బయలుదేర లేదు.

జీజీబాయి—మీరు కాలము నంతయు భగవద్ధ్యానము నందు గడుపుచుందురు. ఆకాలములోనె కొంత సంఘసేవకై వినియోగ పరచిన బాగుండును గదా.

తుకారాం—ఇంత వఱకు నేను దేవుని భజించుచుండ పరిహాసముఁ జేసితివే. ఇఁక సంఘసేవఁ జేసిన సహింతువా?

జీజీబాయి—ప్రాణేశ్వరా! నన్నెంత పాపవర్తనురాలుగఁ దలంచితిరి. పతియాజ్ఞకు వ్యతిరేకముగ నెన్నఁడేనియు నడచుకొంటినా? మీమాటకు బదులుఁ జెప్పఁ గలనా! చెప్పి బ్రతుకఁ గలనా! బిడ్డ లింటిలో నాకలియని యఱచుచుండ కన్న కడుపై యున్నందునఁ దాళలేకఁ గావలసిన వస్తువులఁ దెచ్చి పిమ్మట దేవుని భజింపుమంటిని. నాథా! మీ నీతి వాక్యముల వినుచుఁ బిల్లల సంగతి మఱచితిని. అయ్యో! వారు లోపల యెంత విలపించుచున్న వారలో (వినుట నభినయించి) పాపము! దుఃఖించి దుఃఖించి, పసి నిదురఁబోయి యున్నారు కాఁబోలు శబ్ద మేమియు రాకున్నది. నాథా! మామగారు గడించిన ధనమంతయుఁ గొంచమేని లేకుండ విఠోబా దేవాలయమును గట్టుటకు వెచ్చించితిరి. ఇంటిలో యేపూట కాపూట భత్యముఁ గొనివచ్చి తినవలసి వచ్చినది. ఈ పూటకుఁ గావలసిన వస్తువు లింకను

గొనిరాలేదు. మీరేదైన నొకవ్యాపారమును జేయుఁడు. వర్త
కము వలన మీ దైవచింతనము నిరాటంకముగ నెఱవేఱఁ
గలదు. అందఱమును సుఖముగ జీవింపఁగలుగుదుము.

తుకారాం—ప్రేయసీ! వ్యాపారమును జేయుటకు మనయొద్ద కావలసిన
ధనములేదు. వ్యాపారముఁ జేయకున్న మనము బ్రదుకఁ జాల
మా! మన పాలిటి విఠోబా దేవుఁడే మనలఁ గాపాడ గలఁడు.
నీవు భయఁపడక ఆయనను భజింపుచుండుము.

జీజీబాయి—నాథా! నేను దేవుని భజించుచునే యుందును. మీరు
వర్తకమును వెంటనే ప్రారంభింప వలయును. మిమ్ములఁ జూచి
సాటివారు యెగతాళిఁ జేయుచున్నారు.

తుకారాం—చేయనిమ్ము. మనకేమి నష్టము?

జీజీబాయి—అటులగాదు. మీరు నామనవి విని తీరవలయును. మీకు
వర్తకమునకు గావలసినది ధనముగదా. నా వివాహమున నా
తండ్రి ప్రేమమై యొసఁగిన వేయిరూప్యముల విలువగల నగలు
నాయొద్దనున్నవి. అవి మీకొసంగెదను. వాటిని నేఁడే విక్ర
యించి మంచి గుడ్డల యంగడిని బెట్టుఁడు. రేపటి దినము దుకా
ణముఁ బెట్టుటకు మంచి ముహూర్తము.

తుకారాం—మీ తండ్రి ఆ నగలను నీవు ధరించుకొనుటకై యొసంగి
యున్నాఁడు కాని నా వర్తకమునకై యిచ్చియుండలేదు.

జీజీబాయి—నాథా' మీరేల జడియవలెను.

తే॥ గీ॥ తరుణి సొత్తుల హరియించు • తలఁపుఁగలిగి
తెమ్ము మెఱుఁగును బెట్టించి • తెత్తు ననుచు
బలికి కులటల పాల్జేయు • వారు లేరె ?
కోరి నేసీయ నగలను • గొన వదేల? 14

నన్ను బలవంత పెట్టికాని లేక నాయనుమతి లేకుండఁగ కాని నా
నగలను మీరుఁ దీసికొనుట లేదు కదా. అదియును గాక మనసంసార
మును వృద్ధిఁజేయుటకే వ్యయపఱచ నున్నాము కాని యితరకార్యము
లకుఁ గాదు కదా. నా సంతోష పూర్వకముగా నే నొసఁగెదను.

తుకారాం—సతితిలకమా! నీవు చెప్పునది సత్యమే కావచ్చును. ఆ యాభరణముల నీతండ్రి నీకొసంగి యున్నాఁడు. నే నవి దీసి కొన రాదు.

జీజీబాయి—నావస్తువు లన్నియు మీవస్తువులు కావా? నేనే మీదాననై యున్నపుడు నా మీది వస్తువులు మాత్రము మీవి కావా? నన్ను మీర లెటులైనను జేయవచ్చును. నను మీ యాజ్ఞను జవ దాటకుండ మెలంగ వలసిన విధి నాపై నున్నది. మీరింక యాలోచింపక త్రేపే బట్టల దుకాణమును బెట్టవలయును సుడీ!

తుకారాం—అయ్యో! నా యంతరాత్మ వలదను చున్నది. చేసికొనిన భార్యసొత్తులఁ దీసికొని వర్తకము జేయు చున్నాఁడను నపవాదము నెటుల భరింప నగును. సఖీ! నీవేమైన ననుము; అది నాచేతఁ గాని పని.

జీజీబాయి—(తనలో) అబ్బా! యీయన బుద్ధి మార్పు టెట్లు? (తల యూచి) ఊరక విడువరాదు. చూతము. (ప్రకాశ) నాథా! మరల మొదటికే వచ్చితిరే. మీ మాటలఁ జూడ నాకు వింతగ నున్నవి. భార్య సొత్తులను భర్త తీసుకొనుట తప్పా? భర్త కాక యితరులా తీసికొన వలసినది? మీరిఁక బదులుఁ జెప్పక కార్యక్రమము నాలోచింపుడు. మీ రీయ కొనకున్న నా యా (అర్ధోక్తి.)

తుకారాం—వలదు వలదు. సమ్మతింతును. ఆనఁ బెట్ట వలదు.

జీజీబాయి—సరే అటులైన నిఁక నన్నియుఁ జక్కఁ బడును. పెద్దల సేమ మారయుదము రండు. (నిష్క్రమింతురు)

## —* ద్వితీయ రంగము *—

ప్రవేశము:— తుకారాం సేట్ దుకాణమున నిరు ప్రక్కల పలు విధములగు గుడ్డలు వరుసగాఁ బెట్టికొని గూర్చుండి యుండును.

తుకారాం—

చ॥ ఘనమగు దేవు నాలయముఁ • గట్టి విఠోబకు సేవఁజేయఁగా
ఘనమతి నెంచి యా పగిదిఁ • గట్టి ధనంబును గోలుపోవుటల్

గనుగొని తండ్రిబెట్టిన సొ • గల్ దెగనమ్మి యొసంగె నాకు నా
వనజ దళాక్షి యీ కలి, • వంటి వధూటి జగాన నుండునే. 15

ఉండరు. నిజమా, స్త్రీలు దురాశా బద్ధ చేతస్కలు. నాసతి అటు వంటిది గాదు. నాకన్న నామె మహా సుభావురాలు. నాదీనావస్థ నవలోకించి నిమునస్వానను సహింపక తన కత్యంత ప్రియతమము లగు నగల నూడ బెరికి బతిమాలి సంవిధానము జేసి యిచ్చి వాని నన్నిటి విక్రయించి వర్తకమునకు వలసిన వానిని దెచ్చి పెట్టి యున్నది కదా! ఇట్టి సుగుణాలరాసిని విధి నాకుఁ గూర్చి నందులకై నే నెంతయో సంతసింప వలసి యున్నది. విధాత తా నొక్కొకపుడు దంపతులఁ బరీక్షించుటకై వ్యత్యస్తముగఁ గూర్చుటయు గలదు కాని; అట్టి విపరీతము మా యెడఁ జేయలేదు.

తే॥ గీ॥ సుగుణ ములనెల్లఁ దానొక • చోటఁ గూర్చి
అబ్జ కాంతుల గలుగు సో • యగముఁ జేర్చి
ధరణిఁ బుట్టించె నేమొ నా • కొఱకు ధాత
లేని యెడ నా కధోగతి • యే నిజంబు. 16

స్త్రీలకు రూపమునకుఁ దగిన గుణముండుట యరుదు. నా సతి యన్నన్నో రెండింటను దీసి పోవునది కాదు గాని నే నొక్కొకపుడు గృహ కృత్యముల విచారింపక విసుగున నామెపై గోప పడు చుందును. ఆమె దానికయి నగుచుండును. కాని; అవగ మరల క్షణ మాత్రమున భర్తగ మారు చుండుటచే; ఆమె కది యొక లోటు కాదని భావింప వలసి యున్నది. ఇప్పుడీ కలియుగమున భర్తలను సిగఁ బట్టి చీపురు కట్టల పాలుఁ జేయు అధమ యువతుల వలెఁ గాక పతినే దైవముగా నెంచు భార్య లభించినందుకు నా పూర్వ జన్మ సుకృత ఫలము గాక వేరే మున్నది. నాకు వ్యతిరేకముగ నడచు నదియే యై యుండిన నా హరిభజన యేమై యుండునో. ఆ పాండురంగని కృప నా యందుండ అట్టి చిక్కు లేలఁ గలుగును. ఇంకను నా దుకాణములోని వస్తువులఁ గొనుట కెవ్వరును రాలేదు. ఎవరైన వచ్చు వఱకుఁ గాలమును వృథగా గడుపుట కంటె యా హరిని స్మరించు చుండెద.

సీ॥ చేపవై వేదాల • చేకొంటి వపుడు ము
న్నీటి లోపలఁ జొచ్చి • నీరజాక్ష
భూదేవి జలముల • మునిగి యేడ్చుచు నుండ
నీవేగి కావవే • నీరజాక్ష
దనుజుల వ్యథలచేఁ • దపియించు ప్రహ్లాదు
నీవు రక్షింపవే • నీరజాక్ష
రామ చంద్రుండవై • రాతిని నాతిగా
నీవాన ఁంపవే • నీరజాక్ష
తే॥ గీ॥ అమరులన్ బ్రోవ బలి దును • మాడి వాని
నీవు మోక్షం బొసంగవే • నీరజాక్ష
అట్టులే నన్ను మోక్షాని • కనుపు మయ్య
పండరీపురవాసి సీ • భక్తఁ గొలతు 17

హరీ! వైకుంఠవాసా! నీదాసుని రక్షింపుము. పాండురంగా! నీవేగతి (అని చేతుల జోడించి కన్నుల మూసికొని దేవుని ధ్యానించుచుండును.)

ప్రవేశము :—జిత్తుల జీవన్న.:—

జిత్తు—నేఁడు తుకారాంసేట్ దుకాణముఁ బెట్టి యున్నాఁడని వింటిని. అతఁడు తనకాలము నంతయు హరిభజనము నందు గడుపు వాఁడే కాక న్యాయ ప్రవర్తనుఁడు. ఎంతటి కష్ట కాలము వచ్చినను బొంకు వాఁడు కాఁడు. అట్టివాఁడు వర్తకము జేసిన ముందునకు రాఁగలఁడా. అట్టి వానిని మోసముఁ జేయుట కడు సులభము. నేఁడతనిని నెటులైన మోసముఁ జేసి తీరవలయును. తోడు లేక కార్యసాధనము మిగులఁ గష్టము. (అటు నిటుఁ జూచి) ఓహో! నామిత్రుఁడు టక్కరి సుందరము వచ్చినటులున్నది. అతనితో ఆలోచించి చూచెదను.

ప్రవేశము :—టక్కరి సుందరము.

టక్కరి—(జిత్తుల జీవన్న నవలోకించి) "వెతుకఁ బోయిన తీఁగ కాళ్ళకుఁ దగిలినట్లు" నీకొఱకే నే వెళ్ళుచుండ యిచటఁ బ్రత్యక్షమైతివి.

జిత్తు—ఎందు నిమిత్తము.

టక్కరి—నీకు దెలియదా? మనకు మంచి సమయము దొఱకినది. నేఁడు తుకారాంసేట్ దుకాణముఁ బెట్టియున్నాఁడఁట. అతఁడమాయకుఁడు. కనుక మన మోసమును బ్రయోగించుట కిదియే మంచి తరుణము.

జిత్తు—నేను ముందుగనె యోచించి నీ కొఱకై వచ్చుచుంటిని. దీని కింకనుఁ దగిన వారినిఁ బిలిచికొని కలసి వెళ్ళిన బాగుండును.

టక్కరి— ఎందరో యెందుకు మన మిద్దరముఁ జాలదా. టక్కరితనమున నన్ను మించిన వాఁడు లేకుండినందున గదా! మీరు మెచ్చి "సుందరమను" పేరునకు "టక్కరి"యను బిరుదు నొసంగితిరి. నాసంగతి (అర్థోక్తి)

ప్రవేశము—వాసుదేవుఁడు.

వాసు—ఓహోహో! ఇన్ని బిరుదుల కేమి దువ కావలసినన్ని తగిలించుకొనవచ్చును. ఒక రీయవలసిన పనిలేదు. ఇంకొకటి కావలసియున్నఁ జెప్పుము. నేనొకటి కూడ నొసంగెద. బంగరు పతక మేమైనఁ గావలసియున్న యిరువది రూప్యములఁ దెచ్చియిమ్ము. రెండు దినములలోఁ జేయించి ఒకానొకమతి నొసంగెదను.

టక్కరి—ఇరువది రూపాయ లెందుకురా.

వాసు—(ఆశ్చర్యముతో) ఎందులకా! సవరను నాలు పదునైదు రూపాయలు, పతకముఁ జేసి నందులకుఁ గూలి మూఁడు రూపాయలు, చేయించి నందులకు నాకు రెండు రూపాయలు.

జిత్తు—సెబాసు. నీవంటి వాఁడే మాకుఁ గావలసి యున్నది.

టక్కరి—నాకు పతకము లక్కరలేదు. లెమ్ము. కావలసిన యింక రెండు బిరుదులఁ దగిలించుకొనలేనా.

జిత్తు—నీకై నీవె పెట్టుకొనిన నేమి ప్రయోజనము.

టక్కరి—నీ కింకను దెలియదా. మన సుబ్బారావు పంతులు బిరుదులు లేకున్నఁ గ్రొత్తవారు పలుకరింపరని కాఁబోలు, జేనెడు భూమి

లేకున్నను భూస్వామి యనియు రెండు గృహముల కధికారి యనియు, ధనవంతుని యల్లుఁడనియు బిరుదులను తగిలించు కొనిన సంగతి మీకుఁ దెలియదా. అటులనె నేనుఁ గూడ నా చర్యలకుఁ దగిన తోకల నంటించుకొనిన తప్పేమి.

వాసు—నీ తోకలు కాలి పోను. బిరుదు లెందుకోయి. నీ నేర్పరి తనమునుఁ జూపిన మంచిదో లేక చెడ్డదో చూచిన వారే యొసంగుదురు.

జిత్తు—ఇఁకఁ జాలును. సుందరం! మనకుఁ దోడు వాసును గూడ బిలుచుకొని పోవుదము. ఇతఁడు మనకంటె చతురబుద్ధిఁ గలవాఁడు.

టక్కరి—మంచిది.

వాసు—ఎందు నిమిత్తము.

జిత్తు—మన మోసమును ప్రయోగించుటకు.

వాసు—ఎచ్చట.

జిత్తు—తరువాతఁ జెప్పెదను.

వాసు—తుకారాంసేట్ దగ్గరనే కదా'

టక్కరి—నీ వెట్లు కనుఁగొంటివి.

వాసు—నాకుఁ దెలియని దున్నదా? అతఁడు నేఁడు క్రొత్తగ వర్తకముఁ బ్రారంభించెను. అతఁడు దక్క యితరులు మనకు లోఁబడుదురా?

ప్రవేశము—సుబుద్ధి ప్రక్కనుండి వారి మాటలు వినుచుండును.

జిత్తు—అతని దగ్గఱకు మన మేయుపాయముతోఁ బోదము.

టక్కరి—యోచింప వలయును.

వాసు—నీకు టక్కరి యను బిరుదు మే మిచ్చినది మాదే యవివేకము గా నున్నదే. నీ టక్కరి తనమును బ్రయోగింపుము చూతము?

టక్కరి—ఏ మట్లనెదవు. నా శక్తిఁ జూడుఁడు. ముందు నేను వెళ్ళి యొక ప్రక్క నిలిచి తుకారాంతో బేరమాడు చుందును. అతఁడు నాతో మాటాడు నప్పుడు మీ రింకొక ప్రక్కకు వచ్చి ఒక్కొక వస్తువే కాఁజేయుఁడు.

జిత్తు—తిరిగి చూచినఁ బ్రమాదము వాటిల్లును.

వాసు—అట్లుకాదు. నే ముందేగి మాటాడుచు ఒక వస్తువును దీసికొని పరిశీలించు వానివలె నటించి నాణ్యమును జూచుటకు (త్రిత్తుల జీవన్నతో) నీ కొసంగెదను. దానిని నీ పతనికిమ్ము అతఁడు పరీక్షించుచు వెడలిపోవును.

త్తు—ఈ రెండు నెలవేతక పోయిన

టక్కరి—నేనుండ లేదా. నాటకుడు వృథా యనిపించుకొందునా.

వాసు—అయిన ముందుగ త్రిత్తుల జీవన్నను బంపుదము.

త్తు—అదిగో అప్పుడె హిందువుల కార్యక్రమమునకుఁ బూనుకొంటిరే.

వాసు—హిందువుల కార్యక్రమమన్న?

త్తు—ముందుఁ జేయఁ దలంచుకొనిన దొకటి తరువాతఁ జేయునది వేరొకటి. ముందు టక్కరి సుందరమును బంపుదమనుకొనలేదా?

వాసు—అగును.

టక్కరి—అయిన మీరు వెనుక రండు. ముందు నే నేగి మాటలాడుచుండెద. (అని మెల్లగ తుకారామును సమీపించును.)

సుబుద్ధి—(తనలో) ఔరా! ద్రోహు లెంత కార్యమును జేయఁబూనిరి. న్యాయ ప్రవర్తనుఁడగు తుకారామునా వీరు ద్రోహము జేయఁ బూనుట. దురాత్ములారా! మీరు చదివిన చదువు యీ తెరునఁ బరిణమించినదా. పశుతుల్యులుఁ జేయ వలసిన పనుల మీరు చేయుట కిది కాలమహిమ గదా. మీ యాట లెట్లు సాగి వచ్చునో చూచెద. (అని చాటున నిలచి యుండును.

టక్కరి—(తుకారామును సమీపించి) సేటుజీ! మహారాజ్! రాం రాం (అని నమస్కరించును)

తుకారాం—(కన్నులఁదెరచి) నాయనా! ఎందులకు వచ్చితివి. నాతో నేమైనఁ బని యున్నదా లేక వస్తువులను గొనుటకు వచ్చితివా?

టక్కరి—నా కొక తలగుడ్డ కావలయును. ఒకదాని నిండు చూతము.

తుకారాం—చూడుము. (అని యొక దాని నిచ్చును)

టక్కరి—(ఇటునటుఁ ద్రిప్పుచు) ఇంతకంటె మంచివి లేవా?

దలించ కుంటిన యీ సంసారమును బోఁద్రోసి యెన్నఁడో యడవులఁ జేరియుండును. అటులఁ జేయునను భయము తోడనే నే నప్పుడప్పుడు హరిభక్తి కంతరాయములఁ గలిగించు చుందును. (యోచించి) ఈయన నిద్రించు చున్నాఁడు. వ్యాపారమున నష్టముఁ జెచ్చి నందులకు నిద్రా భంగ మొనర్చి మంద లింతునా (ముందున కేగి యోచించి) వలదు వలదు. పతి నిద్రాభంగముఁ జేసిన పాపము సంభవించును. ఆయన మేల్కొను వఱకు నిం దే యుండెద. (వినుట నభినయించి) యేమో కలువ రించు చున్నాఁడు. వినియెదఁ (ప్రక్క కొదిగియుండును.)

తుకారాం—(పరుండి నిదురలో) పాండురంగా' పోకుము పోకుము. అయ్యో! నా పేరును మార్చి నా యింట భుజింపకఁ బోయెదవా? నే నేమైన లోటుఁజేసితినా ఈ పాపి సంసార సాగరమునఁ బడి నిన్నుఁ దెలిసి కొనఁ జాలఁడని కోపమా? నేను గూడ నీవెంట వచ్చెద నిలుము, నిలుము. (అని లేచి కూర్చుండును)

జీజీబాయి—నాథా! ఏమి కలువరించు చున్నారు?

తుకారాం—తరుణీ! నీ వెప్పుడు వచ్చితివి. పాండురంగనిఁ జూడ లేదా.' పిలిచినను నిలువక పోయెను. భజన చేయుదము రమ్ము. మరల వచ్చును.

జీజీబాయి—(కోపముతో) పాండురంగఁడు! ఎవ్వరును రా లేదు. మీ రూరక వాగకుఁడు. మీ బోటి వానికి ఆయన కనఁబడునా? కనఁబడి మిమ్మేమైన రమ్మని పిలిచెనా'

తుకారాం—ఏమనెనా తుకారామా' భేతిల్లకి నన్ను భజింపు చుండుము. నీ కిప్పటి నుండియు "సేట్ తుకారాం" అను పేరు కూడదు. "భక్తతుకారాం" అని నేను నామకరణము జేసితిని. నీకిఁక మీఁదట కవిత్వ మలవడును వేదాంత గ్రంథములను వ్రాయు చుండుమని జెప్పి యదృశ్యుఁడయ్యె.

జీజీబాయి—మీ యీ కలలోని మాటలు నమ్ముటకు తిక్క తిమ్మక్క లేరును లేరు.

తే. గీ. కలను గాంచిన దెల్లను • కల్ల గాక
సత్యమని నమ్ము వారలీ • జగతిఁ గలరె
తుకారాం- కాదు సత్యంబుఁ గాంచితిఁ • గన్నులారఁ
బాండురంగని నాదేవుఁ • బాప రహితు. 19

ఏమి! కలయని పరిహాసముఁ జేసెదవా. నేను జాగ్రితావస్థలో నుండి యించుకఁ గన్నులమూసికొని, అతనినామమును నొకసారి ధ్యానింప నా కట్టెదుట నిలచి, పై మాటలుఁ జెప్పి కన్నులు విప్పి వీక్షించు నంతకి యదృశ్యుఁడయ్యెను గదా.

జీజీబాయి—నాథా! మీ దేవుని మాటలు యటులుండనిండు. దుకాణము గతి యేమి చేసితిరి. వస్త్రము లన్నియును బీదలకు దానము చేసిన మన ధనము వచ్చునెట్లు. ఇంటి వర్తకు లందఱు మీరు దివాలాతీసి నారని నదంతి వ్యాపింపఁ జేసి యున్నారు. అయ్యో! ఇట్టి యవమానమును భరించు టెట్లు. వెలుపలికి ముఖముఁ జూప వలయునన్న మనసు రాకున్నది.

తుకారాం—సతితిలకమా! నా వ్యాపారమున యించు కంతయు పాపమునకు మూలమగు కార్యమొనర్పకుండ నుండు నటుల మెలంగితిని. ఇతరులు నన్ను దివాలా తీసెననుటకును, నన్యాయముగ మెలంగె ననుటకు.

సీ. అప్పుఁ దెచ్చిన చోట • నరికాసుతోఁ గూడ
నిచ్చితి నే హా • యింప లేదు
వస్తువు లమ్ముచోఁ • బలుక నసత్యంబు
చెడు వస్తువులను నే • పెడగ లేదు
లెక్కల నెగవ్రాసి • లేని వడ్డీసి గట్టి
కొంపలు నిలుపునఁ గూల్ప లేదు
నూరు రూప్యములిచ్చి • యేగు నూర్గకు నేను
గుటిలతఁ బత్రములఁ • గొనఁగ లేదు.
తే. గీ. నమ్మి పత్రంబు నిచ్చిన • నిమ్మళముగ
నోట దిగమ్రింగి లేదని • నుడువ లేదు

ఇచ్చి పోయిన సొత్తును • నియ్య లేదు
పొమ్మ టంచును యేరితోఁ • బొంక లేదు. 20

నన్ను దివాలా తీసె ననుటకు నే నెవరికిఁ గాని నూటికి యిరువదియైదు రూపాయల వంతున యప్పుఁ దీర్చ లేదు కదా. ఆస్తినంతయు గుప్తపరచి నా యొద్ద కాసైనను లేదంటినా. లేక భార్యవగు నీ పేర యాస్తిని జేసి యప్పుల నెగర వేసితినా. లేము. ఇఁక మన కేటికి యవమానము రాఁగలదు. నీ వేమియుఁ జింతిల్లక మన విఠోబాను సేవించు చుండుము.

జీజీబాయి—నాథా! ప్రతిదినము నొకింత సేపు పాండురంగని భజించుచు నే యున్నదాన. వ్యాపారమున మీ రన్యాయముఁ జేయవలెనని నేఁ గోర లేదు. తగిన లాభముతో నమ్మిన చాలు నే. ఒక్కొక పుడు లాభము లేక పోయినను తెచ్చిన వెలకైనను విక్రయింప వచ్చును. అట్లుఁ గాక మీరుఁ గొందఱ కుచితముగా నిచ్చిన మన గతి యేమి. సొత్తులుగూడ వృథాయయ్యె నే.

తుకారాం—ప్రేయసీ! నేను ప్రథమమున నేఁ జెప్ప లేదా. నీ తండ్రి నీకు బరిణయ కాలమున నిచ్చిన నగలఁ దీసి కొననని అప్పుడేల తొందరఁ బడితివి

జీజీబాయి—నాథా! ఇపుడు మాత్రము మిమ్ముల నేమంటిని. నా యాభరణముల మీ కిచ్చితి నని గర్వపడ లేదు.

ఉ. మానిను లెందరో పతిని • మానని భక్తిని పూజసేయరే
మేనధరించి నట్టి తమ • మేలిమి బంగరు సొత్తు లియ్యరే
కానన సీమలఁ దిరిగి • కాంతుని సేవనుఁ జేయుచుండరే
యానతి మీర రాదనుచు • నక్కట! ప్రాణములఁ ద్యజింపరే. 21

అట్టి వార లెందరో మన భారత భూమిని మని, యిపుడు స్వర్గమున సుఖపడు చుండ లేదా. నేను మీ కే మొసఁగితిని. స్వల్ప వెల గల నగలకై నేఁ బరితపించెద ననుకొంటిరా. సావిత్రీ మహా దేవి ముందఱ నే నెంతటి దానను. చంద్రమతి కాలి ధూళి కైనను నేను సరితూఁగఁ గలనా! పతియానతి ననుసరించి తమ ప్రాణముల

యుద్ధభూమి కంపించి వీరస్వర్గము నలంకరించిన రజపుత్ర యువతీలలామల గోతి కెనయగుదునా. నా కేనాటి భయము లేదు కాని, ముందు మన కుటుంబము గతి యెటులగునో యని భీతి కలుగు చున్నది.

తుకారాం—ఎందులకు భయపడ వలయును. భయపడిన మన కష్టములు తీరునా? పాండురంగని దయయుండు వఱకు మనము సలక్షణముగ నుందుము. సఖీ! యిప్పుడు మన మేమైన దారిద్ర్య మనుభవించు చున్నామా.

జీజీబాయి—మనము దారిద్ర్య మనుభవింపక సుఖముగ నున్నామా? ఒక్కొక్క పూట వేళ కన్నము లేక బిడ్డలు పరితపించుచుండుట మీరారసిన సహింతురా.

తుకారాం—సతీతిలకమా! మన మొక్క పూట యన్నము భుజింపక వస్తు పడినది లేదే. ఇప్పుడు మనభరత ఖండమున నొక్క పూటకైనను తినుట కాహారముఁగాని త్రాగుటకు గ్రుక్కెడు గంజిగాని లేక యేడు కోట్ల ప్రజలు మలమల మాడు చుండుట నీకుఁ దెలియదా! నీవే యిటు లనుకొనిన వారెటులఁ బరితపింప వలయును.

తే. గీ. చేయఁ బోయినఁ బనులు లే • వారియెఁ దగిన
పనులఁ జూపెడి వారలుఁ • గనుల బడరు
యెటులఁ బ్రతుకుచు నున్నార • దేమొ కాని
తెలియఁ గరాదు వారలుఁ • దెలుపరైరి
కనికరము లేక వారని • కఠినమతిని
సృష్టిఁ జేసెను భూమిపై • స్రష్టతాను. 22

జీజీబాయి—నాథా! మీమాటలు సత్యము. పేదవారిని జూచినఁ జాలి గల్గును. నాథా! వారిలో సహితముఁ గొందఱు దుర్మార్గులున్నారు. వారికిఁ దగిన పనులఁ జూపెడి వారున్నను పనులఁ జేయుట కష్టమని

సీ॥ బలశాలు లయ్యుతా • బలహీను లనుబోలి
యింటింట ముష్టెత్తి • నేగు వారు

తిరుపతి కొండకుఁ • దరలు చున్నామని
గడియించి ముల్లెలఁ • గట్టువారు
మూఁగ వారలమని • కాగితమునుజూపి
ధనమును హరియింపఁ • దలఁచు వారు
వాయిద్య ములతోడి • పాటలఁ బాడుచు
గుమికూడి యాచింపఁ • గోరు వారు

తే. గీ. కనులఁ గన్గియు లేవని • కల్లలాడి
సందు గొందుల యాచించు • మంద మతులు
బయలు దేరుచు నున్నారు • బ్రతుక నేర్చి
చెమట నూడ్చి గడించుట • చేతఁ గాక. 23

తుకారాం—తరుణీ! నిక్కము వచించితివి. బీద వారలను యాచరంచి నను కొంత మెచ్చవచ్చును. కొందఱు యిటీవలఁ దమయుక్తి నెవ రెఱుంగరని గౌరవ యుతమగు భిక్షాటనమునకుఁ గడంగు చున్నారు. ఎట్లన,

తే, గీ. పారశాలను గట్టింతు • బాలు రకును
బీద వారికి నన్నంబుఁ • బెట్టఁదలఁతు
వడుగుఁ జేయంగవలె నొక • వటువునకని
బత్రములఁ జూపి పలలను • బన్ని పిదపఁ
మంచి మాటల ధనము గ • డించు చుంద్రు
కపట వేసము తోడిని • క్కాల మందు 24

ఇతర దేశములయందు శతవృద్ధులును, అంధులును, వికలాంగు లును, దప్ప నితరులు బిచ్చమెత్తరాదను నొక కట్టడి గలదు. మన దేశ ముననో అటులఁ గాక ప్రతివారును బిచ్చమెత్తి తమ జీవనమును సుఖ ప్రదము గావించుకొను చున్నారు. మన వారు శ్రమల కోర్చి పనులఁ జేయుకున్నందున నే గదా! మన దేశమున చేతిపను లన్నియు మాసి పోయి ప్రతిదానికిని యితరుల నాసింప వలసి వచ్చినది. అందువలన నే మనము దారిద్ర్య మనుభవించు చున్నాము.

జీజీబాయి—నాథా! మీపలుకులు సకలజన సమ్మతంబులు. ఇందు వలన మన దేశము దారిద్ర్యమునకు లోనై యున్నను, దాన పరుల కునికిపట్టని యితరులచే బొగడఁబడును. గనుక మన దేశమాతకు నెటులఁ జూచినను గౌరవమే కలుగు చున్నది

తుకారాం—

చ॥ పుట్టిన మేని కండలను • మోహము జెంద కొసంగు రాజులున్
బొట్టకు లేదు నాకనిన • భూముల నిచ్చు ధనాఢ్యు లార్ద్రమై
తిట్టిన గాని లేదనుచుఁ • దెల్పక నర్థము గూర్చు సజ్జనుల్
దిట్ట తనంబునన్ గలుగు • ధీరులు భారత భూమి పేర్వడన్. 25

వేళకు వచ్చిన యతిథికిఁ బెట్టకఁ దామును గుడువనివా రెవరన్న ముందు భారతీయులను జెప్పి, పదప యన్య దేశీయులను జెప్పవలసి యున్నదికదా. అటులఁ జేయుచున్నందుననే మన దేశమున భిక్షుకుల సంఖ్య దినదినాభివృద్ధిఁ బొందు చున్నది. ఇంతటినుండియైనను బిచ్చగాండ్ర స్థితిని జూచి బిచ్చమిడుచు తక్కిన వారికిఁ దగిన పనులఁ జూపు చుండిన మన దేశము చాల బాగు పడఁగలదు.

జీజీబాయి—నాథా! ఏమి! అతిథుల కన్నమిడుచున్నందున యాచకుల సంఖ్య వృద్ధి యగుచున్న దనిన మీ యభిప్రాయ మేమొ తెలియ వలెను.

తుకారాం—అతిథులను సత్కరింప రాదని నా యభిప్రాయము గాదు. ఇతర విధమున సంపాదించు కొను శక్తిలేని వారిని సత్కరించియే తీరవలయును. తక్కిన వారికిఁ దగిన పనులఁ జూపి కాపాడ వలయును.

జీజీబాయి—నిక్కము పచించితిరి. అయ్యో! నాథా! మీ పలుకుల యందేమున్నదో కాని; నను వచ్చిన పని మఱచి యేమేమొ మాటలాడఁ దొడఁగితిని.

తుకారాం—నీకేమి కావలయును.

జీజీబాయి—ఏమియు లేదు. మనకు రావలసిన యప్పులను వసూలుఁ జేసి ఆ ధనముచే మఱియొక వ్యాపారముఁ జేయుఁడు.

తుకారాం—అప్పియ్య వలసిన వారు తమకడ ప్రస్తుతము లేదని నొక్కి చెప్పుచున్నారు. వారిని గట్టిగ యడిగి తొఁదఱ పఱచిన నేమి ప్రయోజనము. తొందఱఁ జేసిన లేదందురు. అప్పుడేమి చేయఁ గలము. న్యాయస్థానముల కేఁగ వలసి వచ్చును. న్యాయ స్థానమున కేఁగుట నాకు సరికాదని తోఁచుచున్నది. అటుగాదు దగ్గర లేనపుడు మనగతి కూడ యంతేకదా.

జీజీబాయి—అప్పులను రాబట్టు విధాన మిదియా.

తే. గీ. అప్పు నడిగిన లేదని • చెప్ప కుండ
వెంటనే యిచ్చు వారలు • కంటఁ బడరు
అడిగి రాబట్టుటే యిపు • డవసరంబు
"అడుగ కుండినఁ బెట్టునే • యమ్మ యైన." 26

మీరటులఁ జేసికదా ముందు వర్తకమున నష్టము దెచ్చితిరి. మనకు రావలసిన ధనమిపుడు రాకుంటిరి కదా. అటులైన నేను మా తండ్రి కడకేఁగి కొంత ధనమును గొని తెచ్చెదను. దానితో నైన వ్యాపారముఁ జేయుదురా?

తుకారాం—నీకెందుల కింత కష్టము. నీవేగి నీతండ్రిని ధనమడిగిన యతఁ డియ్యకున్న నేమి చేయుదువు. నీ మగఁడు నిన్నుఁ గాపాడఁ జాలఁడా యని యతఁ డనిన నే నేమన వలయును?

జీజీబాయి—ప్రాణేశ్వరా! మా తండ్రి యంతటి యవివేకుఁడు గాఁడు. మీరన్న యాతనికి మిక్కిలి గౌరవము, మఱియు నాపై యనురాగము మిక్కుటము. నేనడిగిన ధనమియ్యక నిరాకరింపఁడు.

తుకారాం—అతని యాచించుట కంటె యవమాన కార్యము వేరొకటి యున్నదా. అడిగిన లేదనఁ జాలక కొంత ధన మొసఁగినను మనకేమి చాలును. అదియుఁ గాక,

తే. గీ. మనకు లేకున్న నితరుల • ధనము తోడఁ
జేయు వర్తక మెప్పుడో • చెడును వినుము
"తల్లి పాలను ద్రాగెడి • పిల్ల బలము
పోత పాల్ద్రాగు శిశువుతాఁ • బొందఁ గలదె". 27

జీజీబాయి—నాథా! మఱేమి చేయ వలయును. మీ మాటలు నా కంత సమంజసముగ నుండుట లేదు.

తే. గీ. మనకు లేదాయె నేఁబోయి • జనకు నొద్దఁ
దీసి కొనివత్తు నన్ను మీ • రాన గొనరు
"అమ్మ పెట్టను మఱియేరి • నడుగ నీదు"
యనెడి యార్యోక్తి మీకడఁ • గనగ నాయె. 28

అయిన ముందు మీ రేమి చేయఁ దలఁచు కొన్నారు. మన గతి యింత యేనా?

తుకారాం—మనగతి యింతయేనా యని యడుగుటకు మన క్షేమైనది. పాండురంగని దయవలన సుఖముగ నున్నాము. ఇఁక నేనేమి చేయఁ దలఁచు కున్నాననియా నీ వడుగునది. వేదాంత గ్రంథములను రచింపమని నాకా దేవుఁడు సెలవిచ్చి పోయెను. ఆ మహానుభావుని మాట మీఱ నా వశముగాదు. కనుక నీవు వెంటనే లోపలికేగి కొన్ని తాళ పత్రములను గంటమును సిద్ధపరుపుము. నేఁడే ప్రారంభించెదను.

జీజీబాయి—నా చేతఁ గాదు. మీరే జేసి కొనుఁడు. మీ యిష్టము మీ పిల్లల యిష్టము. నాకీ సంసారము వద్దు. (అని నిష్క్రమించును.)

తుకారాం—స్త్రీలు చపల చిత్తులనుట పెద్ద వారి తప్పు కాదు. న నెంత బోధించినను దేవుని నమ్మకున్నది. నేను వ్యాపారము చేయక పోతినని యలిగి పోయెను. నేను కూడ వెళ్ళి యామె బుద్ధిని మంచి త్రోవకుఁ ద్రిప్పఁ బ్రయత్నించెద.

(నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.



# తుకారాం

## ద్వితీయాంకము

(ప్రథమ రంగము.)

ప్రవేశము—పద్మ సర్వాహరి యను వేశ్య గృహమునందు.

పద్మ—(నిలువఁబడి వ్యసనముతో)

ఆ. వె. బ్రాహ్మణోత్తములను • బాధించితినొ లేక
గోవు లఁగొని బల్మిఁ • గోసి నానొ
కావరమున నన్య • కామినీ రతుఁడైతొ
పూర్వ పాప ఫలముఁ బొందఁగంటి. 29

ఎన్ని యాచరింపనిదె యీవిపన్మహా సముద్రమునఁ జిక్కుదునా. ఈ పాడు జన్మనుఁ బొందఁగలుగుదునా. బొందితినిపో; యీ మాయలాడి చేతఁ బడి యిట్టులఁ బరితపింతునా. ఔరా! నేనొక హీనకుల సంజాత నఁట. పుట్టిపురుడు ముగియక ముందె నా జనని పర లోకమున కేగెనఁట. అంతట నా తండ్రి పసి బిడ్డనై యున్న నన్ను సాకఁ జాలకఁ బరితపించు చుండ నాయంద చందములఁ గాంచి; యీ పాపిని యగు సర్వాహరి యేబది రూపాయలకు నన్నుఁ గొని పెంచెనఁట. అకటా! ఇది నా పూర్వ పాప ఫలముఁ గాకున్న నా జనకుఁడు కాసింత ధనమునకై దీనికి విక్రయించునా. ఈకాలమున భాగ్యవంతు లెందరో బిడ్డలు లేక పరితపించు చుండ వారి కొసఁగక యీ రాక్షసికి విక

యుంచుట నా కర్మ ఫలమే గదా. గుణవంతు లెందరో యుండం, మా తండ్రి కన్నులకు యీ కులటాంగనయె కనబడుట నా తల వ్రాతగాక వేరేమున్నది. నేజన్మించినది హీన కులమైనను నా కాకులమె బాగుండి యుండును ఈ సర్వహారి తెగ మాజాతికంటె యెక్కువ యని యం దురే కాని; యీప్రపంచమందున్న కులములలో నెల్ల హీనకులమని తెలియరు. ఈ నా పెంపుడు తల్లి యగు సర్వహారి మా కులములో నెల్ల గౌరవముఁ బడయుచు వేశ్యామతల్లి యనిపించు కొనినది. ఔరా దీనిచేఁ బెంపబడి నందున నా కులము గూడ వేశ్యాకులముగ మారెనే. ఇన్ని దినములు చిన్నదాననై యున్నందున నా కంత కష్టము దోఁచ లేదు. ఇప్పుడు వయసు వచ్చినది మొదలు ఆదుర్మార్గురాలు నన్ను వేశ్యావృత్తికిఁ బురి కొల్పుచున్నది (అయిష్టమును జూపుచు) అబ్బా! ఆపాడు వృత్తికి నే నెటులోయ కొందును. నా యంతరాత్మ వలదన్న సమ్మచున్నది. ఆ వృత్తికి తెంచిన,

సీ. ముసలి పీనుఁగ యైన • ముక్కిడి తొత్తైన
చనువుతోఁ గౌఁగిట • దనుప వలయు
అంగహీనుండైన • నతి దరిద్రుండైన
మురిపెంపు ముద్దుల • మురియ వలయు
వయసునఁ జిన్నైన • బలు రోగయుతుఁడైనఁ
బక్కపై నొకటిగాఁ • బండవలయు
కఠినమానిసియైనఁ • గడజాతివాఁడైన
యింపుతో పనుల సా • గింప వలయు
తే॥ గీ॥ ఎవరుఁ బలచిన సరియని • యేగ వలయుఁ
నేగి దండంబుఁ దప్పక • నిడగ వలయుఁ
జేయు మనుకార్య ములనెల్లఁ • జేయ వలయుఁ
గటకటా! వేశ్యలకు నిఁక • గలదె సుఖము. 30

ఔరా! యింతటి పాపకార్యమెందైనఁ గలదే నాపెంపుడు తల్లి యగు సర్వహారి నన్నిట్టి కార్యమున కియ్యకొను మని ప్రోత్సాహ పర చునని నేను కలలో నైన ననుకొని యుండ లేదు కదా. మనమీవృత్తి

మానుదమన్న నాపైఁబడి చంపును. ఆమె మొదటినుండియు యిరువురి విటాధములకు లోనై యున్నది. ఆమె కొంతవయసుఁ జెల్లినదై నంతనె వా రామెపై యనురాగమును జూపకుండ రాబడి తగ్గునని వారికి నన్నొప్పగింప నెంచఁగా వారును సమ్మతించిరఁట. ఇట్టి దెంతైనఁగలదే. నామేనఁ బ్రాణము లుండు వఱకు ఆకార్యము కాఁజాలదని నాతల్లితో తగవులాడితిని. వా రేయూరికో వెళ్ళి రేపటి దినము రా నున్నారఁట. వారేతెంచిన వెంటనే, నేను వారి వశముఁ గావలయునఁట. ఆ దుర్మార్గులు మొదటి నుండియు నా తల్లిని ప్రేమించిరి గదా. నేను సర్వహారికిఁ గలుగక పోయినను ఆమెను నా జననిగా భావించితిని. అట్టియెడ నే వారికి బిడ్డ నగుదు గదా. పుత్రినా ప్రేమించుట ఔరా! కాలమహిమ. అందులకే గదా యిప్పుడు ధర్మ మడుగంటు చున్నది. ఇన్నిటికిఁ గారణము ఈ వేశ్యాకులమే గదా. ఈ పాడుకుల మెన్నడు నశించునో కదా. ఆపాపిని నేనెంతఁ జెప్పినను వినకున్నది. (అఁటునిఁటుఁజూచి) ఆ రాక్షసి వచ్చినటులున్నది. ఏమి తెలియని దానివలెఁ గూర్చుండెద.

(ప్రవేశము—సర్వహారి)

సర్వ—పద్మా! ఏమి చేయు చున్నదానవు.

పద్మ—ఏమియును చేయ లేదమ్మా.

సర్వ—ఏమో యోచించి చెప్పెద నంటివే; యేమి యోచించితివి.

పద్మ—దేనిని గుఱించి చెప్పితినో.

సర్వ—(కోపముతో) దేనిని గూర్చి చెప్పితివో. అప్పుడే మఱచితివా? నీ బుద్ధి నీ స్వాధీన మందుండిన గదా మఱువకుండుట.

పద్మ—అటులఁ గాదమ్మా! (అర్ధోక్తి)

సర్వ—ఇంకెటులమ్మా! (అర్ధోక్తి)

పద్మ—నీ వెన్నియో పనులను జెప్పు చుందువు. ఇపుడు నీవే కార్యమును గుఱించి ప్రశ్నించు చున్నావో తెలిసినఁ గదా తగిన ప్రత్యుత్తర మొసఁగుట

సర్వ—చెప్పలేదా వారు రేపో యెల్లుండియో రాఁగలరని, వారేతెంచి యేమైనదని యడిగిన నే నేమన వలయును.

పద్మ—అమ్మా! ఆ విషయమై యింకను యోచింప వలసి యున్నది.

సర్వ—గయ్యాళీ! ఎన్ని మారులడిగినను యోచించు చున్నానని చెప్పెదవు. ఇంక నీ యాలోచన ముగియు టెన్నఁడు. నీవాకార్యమునకు సమ్మతింపక తప్పదు. తెలిసినదా?

పద్మ—(తనలో) దైవమా! యేమని ప్రత్యుత్తర మీయవలయును. నే నేమి మాటలాడినను మాటకు ముందు నాపైఁబడి కొట్టును. ఆమె యిష్టమును దీర్పుద మన్న నా యంతరాత్మ యించుకైనను సమ్మతింపదు. అయినను కానిమ్ము. (ప్రకాశముగా) అమ్మా! నే నొకటి యడిగిన కోపము రాదుగదా!

సర్వ—(ముఖము చిట్లించుకొని) అదేమొ కానిమ్ము.

పద్మ—అదిగో. అపుడె కోపపడు చున్నావు.

సర్వ—(విసుగుతో) కోపము కాదమ్మా. అదేమొ త్వరగాఁ జెప్పుము.

పద్మ—అమ్మా! నన్నెవ్వరికైన నిచ్చి వివాహముఁ జేసిన బాగుండును. అందువలన యిప్పటి కొందఱి దుర్మార్గుల వలె ధనాపేక్షచే ముసలి వానికి మాత్రము నియ్యకుము.

సర్వ—బాగున్నది. నీకు వివాహముఁ జేసిన గదా నీవు ముసలి వాఁడని భయఁపడ వలసినది, అందులకే నే నుదువున దేమన్న, నీవు వివాహితవు గాకున్న కోరిన వారితో సుఖముగ నుండ వచ్చును. అందు వలన మనకు ద్రవ్య లాభము కూడఁ గలుగును.

పద్మ—అమ్మా విధాత సతికి పతి యొక్కనినే నిర్మించి యుండ పలువుర నెటులఁ బ్రేమింతునే. అందునను వేశ్యాంగనల పొందుఁ గోరు వారిలో నొక్కఁడేనియు గుణవంతుఁ డుండడు కదా.

సర్వ—వేశ్యాసక్తులైన వారు పదుగురిలోఁ గూర్చుండి మర్యాదఁ గాంచుట నీవుఁ గన్నులారఁ జూచుచుండలేదా?

పద్మ—అవును వారిగౌరవ మింతయని వర్ణింప నలవి కాదు.

ఉ. ఎందఱు లేరు వేశ్యలిలఁ • నేగుచు నుండరె వారి యిండ్లకున్
సందులఁ గొందులన్ ముసుగుఁ • జక్కఁగ వేసుకఁ జిత్త కార్తిలో

సందడిఁ జేయుఁ గుక్కల యు • శంబునుఁ గాంచెడి వారలాత్రిమై
బొందిలో జీవ ముండగనె • బొందరె క్లిష్టము లష్ట కష్టముల్,
అట్టి వారి బ్రతుకొక బ్రతుకా.

సర్వ—చాలుఁ జాలు. నీ శ్రీరంగ నీతులఁ జాలింపుము. నశించిన వారే నశింతురు. మన కేల యీచింత.

పద్మ—అది కాదు స్వామీ! పాపము వారి యకాల మరణమునకు మనము మూలకారణ మవుదుము కదా.

సర్వ—అమిత్రా! విటుల ప్రేమించు రీతి నీ వింకను తెలియదు. తెలిసి కొనుట కిదియే మంచి సమయము వినుము.

తే॥ గీ॥ ధనముఁ గల్గిన యున్నాళ్ళు • దాపుఁ జేరి
నియ్య వలయును విటులను • యేపు తోడ
ధనము లేనంత నేవారిఁ • దఱుముఁ గొట్టి
వెళ్ళ వలయును వేరొక • విటునిఁ జేర. ౩౭

ఒక్కనినె నమ్మి కొని యుండిన మనకు ధన మెటుల రాఁగలదు. కనుక నీ వింటెటి నుండియుఁ బ్రతి దినము సాయంతన మైన తోడనె తలవాకిట నిలచి బజారున కేగుచుండు విటుల నాకర్షింపఁ జేయుచు వారిని నీ వలలో వేసి కొనుము.

పద్మ—అటులఁ గాదే. వారికై వారె వచ్చినను మన మీయకొనుట దోషమై యుండ, మనమై కావలయునని వారిని బురికొల్పుట మఱింత దోసము కదా. అదియుఁ గాక త్రోవనఁ బోవు వారం దఱును వేశ్యాసక్తులై యుందురను మన్నక మేమి

సర్వ—ఇందుకే నిన్ను వెఱ్ఱి దాన వనుట ఈ ప్రపంచ నటన నీ కేమి తెలియును. నా యనుభవమును బట్టి చెప్పుచుండ నీవు నమ్మవు. నాకంటె నీ కనుభవముఁ దక్కువ యను సంగతి నీకే తెలి యును గదా. కనుక వినుము.

తే॥ గీ॥ పలుపు రోగంబు లేక యెు • వ్వాఁడు కాని
వేశ్య వారికి వెళ్ళఁడు • వెళ్ళె నేని

కంటఁ జూడదు సానినిఁ • గాంచె నేని
సాని బంటగు నిజముగాఁ • జచ్చు వఱకు. 33

పద్మ—చూచి నంతటనె దాసుఁ డెట్లగును.

సర్వ—దాసుఁ డెట్లగునా. వాఁడు చూడకఁ బోఁజాలఁడు. చూచినఁ దప్పించుకొని పోవుట వాని పితామహుని చేతఁ గూడ కాదు. ఎందులకన వాఁడు చూచిన వేశ్య వూర కుండదు. అటుల యూరకుండిన నది వేశ్యా చట్టమునకు విరుద్ధ మగును.

పద్మ—ఊరకుండకఁ బరుగెత్తి పట్టి తెచ్చునా? మంచి యుపదేశ మిచ్చెదవు. అటులఁ బోయిన వారు నవీన శూర్పనఖను గావించిన నేమి చేయుదునో?

సర్వ—ఓసి మూర్ఖురాలా! బలవంతమునఁ బట్టి తీసికొని రాఁబని లేదు. వాఁడేగు నప్పుడు జేయ వలసిన విధులఁ జెప్పెదను. బాగుగ నేర్చి కొనుము.

తే॥ గీ॥ విటునిఁ జూచిన యంతనే • వేశ్య తాను
పైట సవరించి కుచముల • బైలుపఱచి
వెంట నేడాఁచి చిఱునవ్వు • వేడ్కనవ్వి
కంటి సన్నలఁ జేసియు • యింటఁ జేరె
తుంట విల్తుని తళుకులఁ • దొంగి చూచి
కిటుకు లనుజేయ కుండెన • విటులు రారు. 36

కనుక వీటి నాధారముగాఁ జేసికొని విటులు నిన్నాకర్షించు నటులఁ జేసి కొనుము. వాటి నింకను బాగుగ నేర్చుకొను వఱకు దాసులై మెలంగు చుండు కుశాల్‌రావును, బంగారు గుప్తను, నీకు దాసులగు నటులఁ జేసెద. వారిద్దరును నాకు యీడు వచ్చినప్పటి నుండి యింతవఱకుఁ గాచికొని యున్నారు. నాకు యేండ్లు యెక్కువగు కొలఁది వారికి నాపై యనురాగము తగ్గుటయే గాక ప్రక్కవీధి రాజీవాక్షికి సందేశ మంపు చున్నటులఁ దెలియు చున్నది. వారు మనయిల్లు మానిన మన యూదాయ మంతయు మట్టి పాలగును. కనుక వారిని నీ

కడకు వచ్చునటుల యేర్పాటు గావించెదను. వారుంగూడ సమ్మతించి యున్నారని నీతో నేనుం జెప్పియుండ లేదా.

పద్మ—అమ్మా! వారు నిన్నుం బ్రేమించి రంటివి. వారిని నీవు భార్య తనభర్త నేవిధముగ సుఖపెట్టునో యారీతి సంతోష పెట్టి యుందువు గదా!

సర్వ—అవును.

పద్మ—అటులైన వారు నీ భర్తలతో సమానమే కదా?

సర్వ—భర్త లగుటకు నా కేమైన తాళిం గట్టిరా?

పద్మ—కాదు. మాట కట్లంటిని. వివాహముం జేసి కొనక పోయినను వారి కోర్కెను దీర్చు చున్నందున నీకుం బతివరుసయే కావలసి వచ్చును గదా?

సర్వ—అటులనే యనుకొనుము.

పద్మ—నీవు నా ప్రియజననివి కదా?

సర్వ—కావచ్చును.

పద్మ—నిన్నుం బ్రేమించిన వారు నీవు నీ భర్తలుగా భావించు వారలు నాకుం దండ్రులు కారా? వారిని మోహించు నునుట సరియా? అమ్మా! నీవుం గూడ యిరువురిని మోహించుట తప్పని చెప్పు చున్నందులకై నన్ను క్షమింపుము.

సర్వ—(కోపముతో) ఓసీ! నీ కెందులకే యింత యధిక ప్రసంగము. ఏమో యని మాటలాడ నిచ్చిన మెకుటవలకుం బోయెదవు. నీవు నాకు బుద్ధి గఱపెదవా?

తే॥ గీ॥ మొన్న జనియించి కన్నుల • నిన్న దెఱచి
నీతి నాకిప్డు నేర్పెడి • రీతిం జూడ
ముందు బుట్టిన చెవులను • నిందం జేయు
కొమ్ములను బోలి యున్నావు • కొమ్మ నీవు. 35

అమ్మాయీ! వారిద్దరిని బ్రేమించితి నంటివి కదా. వారిని యొక రికిం దెలియకుండ యొకరిని బ్రేమించితిని. పాపము యీ నా సాహసము వారుం దెలిసికొనం జాలక యిరువురును తనను దక్క యన్యుని బ్రేమింప

లేదని నమ్మి యున్నారు. ఇట్టివారింకెందరో నేఁ జెప్పఁజాలను. కనుక నీవింత కంటె సాహసురాలవై మెలఁగవలయును. నా పుత్రిక వైనందులకు నా యశమును బోఁగొట్టకుము.

పద్మ—వారు నా తండ్రులని చెప్పలేదా? ఏల నన్ను బాధించెదవే.

సర్వ—(కోపముతో) ఛీ! నోరుమూయుము. మన కొక తండ్రియు నొకత తల్లియు మఱియొక యన్నయు నున్నారా? ఎవఁడు ధన మిచ్చునో వాఁడె మగఁడని విధాతయె లిఖించి యుండుట నీ వెఱుఁగవా?

పద్మ—(దుఃఖముతో) అమ్మా! నే నెంత వేఁడికొన్నను నీకు దయ రాకున్నది. నేనుమాత్రము నీవుఁ జెప్పిన వారిని కలనైనఁ గోరను. నీవు నాకు వివాహముఁజేసిన సమ్మతమే. వేశ్యను యెవరును పెండ్లియాడకున్న నే నిటులనె యుండెద, లేదా యెవరైన నామనసుకు సరియగు వాఁడుండినఁ బ్రేమించి భర్తగా భావించెదఁగాని; పలువురి పాలై పాపమును మఱింత వృద్ధి నొందింపఁ జాలను.

సర్వ—నీవు వారినిఁ దప్పకఁ జేపట్ట వలయును. లేకున్న నీ గొంతు నులిమి వైచెదను. వారు జేపో మాపో రాఁగలరు.

పద్మ—అమ్మా!

చ. కరుణ వహించి నన్నొక • కాంతుని బెండ్లియాడనిమ్ము; త
ల్లిరో యటు కానిచో నొకని • లీల సుఖింపఁగ నిమ్ము వీనికిన్
సరియన కుంటివేని నిను • సారెకు వేడను, చత్తు ఘోరమౌ
గరళము చేతనో మఱియుఁ • గడ్గము చేతనొ దేని తోడనో.

సర్వ—కానిమ్ము చూతము. (నిష్క్రమించును.)

పద్మ—(వ్యసనముతో మఱియొకఁ బ్రక్క నిష్క్రమించెను.)

---

# ద్వితీయరంగము.

[ప్రవేశము:—మఠమునందు మూస్వాజీబాబా, కల్లు కదిరప్ప, భంగి భద్రుఁడు, మదత్ మూటిగాఁడు.]

మూస్వాజీ—భద్రా! నిన్నటి దినమునఁ బంపితిమే, వారిని గూర్చి యేమియుఁ దెలియలేదా?

భం. భ—ఏమియుఁ దెలియలేదు. వీలుపడ లేదు కాఁబోలు. దొంగ పనులకు సరియగు సమయము దొరకక వలదా?

మూస్వాజీ—మనము చేయు పనులన్నియు నితరులకుఁ దెలియదు కదా, మూటిగా! యిటీవల కొందఱు శిష్యులు తగ్గుచున్నారు. కారణ మేమై యుండును.

మ. మూ—స్వామీ! నాకుఁ దెలియదు.

మూస్వాజీ—కదిరప్పా! గ్రామములో దయ్యము పట్టిన వారెవరును లేరా? ఇటీవల మంత్రించుటకు నన్నెవ్వరుఁ బిలుచుట లేదు. ఎటులనైన నొకరికి దయ్యము బట్టింపుము.

క. కదిరప్ప—అందులకె నిన్న ఘరిలోని కేగి యుంటిని. ఎవరును నా పలు కాలకించక పోయిరి. కడకు కడవీధి నున్న విధవ యొకతె తల యూపినది. ఆమె మన చేతఁ బడుననియె ననవలసి యున్నది

మూస్వాజీ—ఆమె ధనవంతు రాలేనా?

క. కదిరప్ప—కాకున్న నే నామెను సమీపింతునా.

మూస్వాజీ—ఓయీ! మన మఠము స్థాపించిన దిన మేట్టిదో కాని మన మెన్ని చెడు కార్యము లొనరించు చుండినను జనులకు మనపై భక్తి స్థిరముగ నిలచియే యున్నది. నీవు యిఁకముందుఁ జేయు కార్యముల యందు జాగరూకుఁడవై యుండుము.

క. కదిరప్ప—మన చేష్టలను దెలిసికొనిరి కాఁబోలు; దినదినమునకు మన శిష్యకోటి సన్నగిల్లు చున్నది.

మాస్వాజీ—అవును. అందులకేఁ గాఁబోలు మూఁడు రోజుల క్రిందట ముప్వురు ముఖ్యశిష్యులుఁ దగ్గిపోయిరి. విచారింపఁగా వారు తుకారాం భక్తులై యున్నారని తెలిసినది.

క. కదిరప్ప—నిజమే యై యుండ వచ్చును. స్వామీ! అంబాభవాని మీ దర్శనమునకు వచ్చుట మానినది అందులకు కారణము తుకారాంజీయే యైయుండునా?

మస్వాజీ—ఎవరైన నేమి పాపము. తుకారామట్టి వారిని దరిఁజేర నీయఁడు వారు చేఁనను భక్తులుగా మారుదురు. అతడు మనకుఁ దక్క నన్యుకు మిక్కిలి మంచి వాఁడు.

భం. భ—స్వామీ! అంబాభవాని యెవరు నే నెన్నడును జూడలేదు.

క. కదిరప్ప—తెలియదా? సుబ్బాదాసుకుఁ బగలు వంటకత్తెగ నుండు బోడి విధవ.

భం. భ—ఏ సుబ్బాదాసు?

మస్వాజీ—అతని మొదటిపేరు సుబ్బారావు పంతులు అతఁ డిప్పుడు సుబ్బాదాసని మాఱుపేరుఁ బెట్టికొని యున్నాఁడు.

భం. భ—అతఁడా! ఇపుడు తెలిసెను. ఆ అంబాభవాని నతఁడు నిశీథమున యర్ధాంగిగ స్వీకరించునని చెప్పుకొను చుండిరి అదియుఁ గాక అతఁడధిక ప్రసంగించుట తనకు సంబంధించని గొడవ లన్నియుఁ దలపైఁ బెట్టుకొని, యితరుల దూషించునట అతఁడు సుబ్బాదాసని పేరేల మార్చుకొన వలయును.

మస్వాజీ—ఇపు డట్టివారినె గొప్పవారిగ నెన్నుచుందురు. ఆ సుబ్బారావు యుంపుడుగత్తెయె మనకు భక్తురాలైనది. ఇటీవల సుబ్బాదాసని పేరు మార్చుకొని తానే పెద్దమనుష్యుఁడనని చాల దుర్మార్గములఁ జేయుచున్నాడు. "మాణిక్యము లోక చోట మసిపాత లోక చోట" యనునట్లు సుబ్బారావు పంతులు, అంబాభవాని, మొదలగు మసిపాతల వంటివారు మన మోసములకుఁ జిక్కి మనదగ్గఱఁ జేరుదురు. మాణిక్యములవంటి దైవ భక్తులు తుకారాముని సేవించు చుందురు. ఇది సహజగుణమే.

భం. భ—స్వామీ! అక్కడ జనులు గుంపుకూడి యున్నారు. ఏమో తెలిసికొని వచ్చెద.

మ. మా—నేను కూడ పోయి మఱలఁ ద్వరగ మీకడకు వచ్చెద.
(ఇద్దరు నిష్క్రమింతురు.)

మస్వాజీ—ఏమిరా! కదరిప్పా! వారెచటికేగుచున్నారో చూడుము.

క. కదిర—(చూచి) అచట గుంపు జేరియున్నారు. నాకుఁజూడ తుకారాం దైవభజనఁ జేయుచున్నట్లున్నది.

మస్వాజీ—వీరిద్దరు సహితము తుకారాము భక్తులై పోవుదురేమో. ఇప్పటికె మనశిష్యుల సంఖ్య చాలవఱకు తగ్గిపోయెను. తుకారాం మనకు బాగుగ దాపుర మాయెనే, ఇఁక మనయాటలు సాగిరా నేరవు.

క. కదిరప్ప—యేమిచేయుదము. ఎప్పటికైనను ధర్మమే విజయ మొందుననుట సకల జనులకుఁ దెలిసినదే కదా. తుకారాం నిజమైన దైవభక్తుఁడు. నిద్రాహారములువదలి పాండురంగనిభజించుచుండును. నాకుఁ జూడ మనముఁగూడ తుకారాఁజీని సేవించుట మంచిది.

మస్వాజీ—ఏమిరా! నీవుఁ గూడ నన్ను విడచి పోదువా? యేమి. మనమా తుకారాముని దరిఁజేరరాదు. సాధ్యమైనంతలో ఆ దుర్మార్గుని యణగఁ ద్రొక్కవలయును. వాఁడు మనియున్న మనకు చెరుపుఁ గలుగఁ జేయుచునే యుండును.

క. కదిరప్ప—స్వామీ! మీరు భయపడకుడు. నేను మిమ్ముల విడచి పోను లెండు.

ప్రవేశము—భంగి భద్రుఁడు. మదత్ మాఱిగాఁడు.

భం. భ—అన్నా! ఇన్ని దినములు మనమీ మాస్వాజీ మాటలువిని యూరక చెడిపోతిమి. చెప్పరాని పాప కార్యములఁ జేసితిమి. మనమీతని విడచి తుకారాంజీని గురువుగా నెంచి పాండురంగని భజింతము.

మ. మా—నిక్కము వచించితివి. నాకుఁ గూడ సమ్మతమే. నేఁడే మామాస్వాజీ సేవను మానితిమని జెప్పి వత్తము రమ్ము.

భం. భ—(మాస్వాజీ బాబాను సమీపించి) అయ్యా! నేటినుండి మీసేవను మానితిమి. మేము తుకారామస్వామి శిష్యవర్గములోఁ జేరితిమి. సెలవిండు.

మాస్వాజీ—(ఊరకుండును)

మ. మా—పలుకకున్నా రేల?

మాస్వాజీ—(తలయూచి యూరకుండును.)

(భంగి భద్రుఁడు, మదత్ మాలిగాఁడు నిష్క్రమింతురు.)

మస్వాజీ—(కోపముతో) ఔరా! ఈ తుకారాముఁడు నా పాలిటికి పరమ శత్రువాయెనే, ఎంత యూరకుండినను నాకు ముప్పుఁ దెచ్చుచున్నాఁడు. దినదినము నాశిష్యులు తగ్గుటయేఁగాని హెచ్చుటలేదు. ఇఁక సహింపఁజాల. నిక్కముగ సహింపఁ జాల. వానికి దగిన శాస్తిఁ జేసినఁగాని లేకున్న నన్నెవ్వరును గౌరవింపరు. అతని దండించుటకు నాకే యపరాధముఁ జేయలేదే. (యోచించి) అయ్యో! నా కతఁడొనరించిన యపకృతి యేది. అన్యాయముగ నతనిపైఁ గత్తిఁ గట్టుట ధర్మమగునె. దేవుఁడు సహించునా (తలయూచి) ఏదైనఁ దప్పుఁజేసిన వానిని శిక్షింపవచ్చునని కాఁచికొనియుండ సమయము దొరకుట లేదు. ఏదో యొక సాకుఁబెట్టి నేఁడో రేపో వాని ప్రాణములుఁ బోవునటుల గొట్టింపక మాన. ఎవరది, అంత త్వరితముగ వచ్చుచున్నారు.

ప్రవేశము:—సేవకుఁడు.

సేవకుడు—స్వామీ! ఏమి చెప్పవలెను. నేఁడు తుకారామస్వామి గోవు మన తోటలోఁబడి చెట్ల నన్నింటిని పాడుఁజేసినది. దానిని బట్టి తెత్తమన్న చిక్కక పరుగిడెను.

మస్వాజీ—తుకారాముదేనా?

సేవకుఁడు—అవును.

మస్వాజీ—మంచి సమయము దొఱకినది. కదిరప్పా! ఇఁక సహింపఁ జాలను. మీ రిరువురును నింకఁ గొందఱిని బిలిచికొని పోయి తుకారాముని బాగుగఁ గొట్టి రావలయును. తప్పకుఁడు. త్వరితముగ వెళ్లుఁడు.

క.కదిదర్ప—చిత్తము. ఇప్పుడే వెళ్లి తుకారాము గర్వమడఁచి వచ్చుట యేఁగాక గోవును సహితము వధింతుము.

(అందఱు నిష్క్రమింతురు.)

---

# తృతీయ రంగము.

ప్రవేశము:—సర్వాహారి గృహమున సర్వాహారి.

సర్వా—(స్వగతము) ఈ దినమున వారు తప్పక రాఁగలరు. పద్మ సంగతిని గూర్చి ప్రశ్నించిన యేమి జెప్పవలయును. (యోచించి) కానిమ్ము. నా యుక్తి యిపుడు కదా కనుబఱుప వలయును. (ప్రక్కకుఁజూచి) అదిగో! బంగారుగుప్త వచ్చునట్లున్నది. (అని కూర్చొని యుండును.)

ప్రవేశము:—బంగారుగుప్త.

బంగారు—ఓహో! నే జెక్కడ లేని సొగసుఁ జేసికొని కూర్చుండి యున్నావే. నేను ఊరికి వెళ్ళిన తరువాత క్రొత్తబేరము తగిలినదా?

సర్వా—అవును. నీ కిక్కడ పనిలేదు పోవచ్చును.

బంగారు—అబ్బో! అప్పుడే కోపము వచ్చినదే.

తే॥ గీ॥ మాట వరుసన నేనొక్క • మాట యనిన
మిట్టి పడెదవు నిన్ను నేఁ • గొట్టి నటుల
"పెన్న మండుండి యెగిరెడి • పేల గింజ
పగిదిఁ" జేయంగ న్యాయమే • పసిఁడి బొమ్మ. 37

కోప పడకుము. తప్పు నాయది యేలెమ్ము.

సర్వ—అగును లెండు మీ మాటలు మీ కే బాగుండును. మాటలకు హద్దుండవలదా?

బంగారు—పోయిన దానిని పోనిమ్ము. మఱల యేలఁ బ్రవ్వెదవు. పోని మ్ము. క్షమాపణఁ గోరెదను లెమ్ము.

సర్వ—(నవ్వుచు) నవ్వుల కట్లంటిని గాని నాకేటి కోపము. ఐన మూఁడు రోజులలో వచ్చెదమని యిన్ని రోజులు పోయితి రేల?

బంగారు—ఎన్ని దినములైనది. నాలుగు దినములే కదా. చెప్పిన దానికంటె ఒక టెక్కువైనది. అంతయే కదా.

సర్వ—మీ కేమో నాలుగు రోజులే. నాకుఁ జూడ నాలుగు వత్సరము లైనటు లున్నది. మీ శాంతి ప్రస్తుతము బాగుగ జరిగినదా. భార్యను వెంటనే బిలిచికొని వచ్చితివా?

బంగారు—వెంటనేఁ బిలిచికొని వచ్చితివా! ఇంకను మావా రెవరును రాలేదు. మీరరాని కార్య మున్నదని వారిని విడచి నే నొక్కఁ డనె వచ్చితిని.

సర్వ—(స్వగతము) ఏమి వీనిపిచ్చి! గర్భాదానము నాఁడు సహితము భార్యకడ నుండక వచ్చియున్నాఁడు. (ప్రకాశముగా) ఆ కార్య మేమొ చూచితిరా.

బంగారు—ఏ కార్యము?

సర్వ—ఇప్పుడేమొ యవసరమగు కార్యమునకై వచ్చితి నంటిరే,

బంగారు—నిన్నుఁ జూచుట కంటె వేరు కార్య మేమున్నది.

సర్వ—అయ్యో! క్రొత్తపెండ్లామును విడచి వచ్చిన నలుగురు నవ్వ రా ?

బంగారు—నవ్విన వారి పండ్లే కనఁబడును.

సర్వ—(స్వగతము) ఔరా! నీయొఱ్ఱు. (ప్రకాశముగా) ఎంత నాపై వలపున్నను పడుచు భార్యను విడచి వచ్చుట మర్యాద కాదు. నేఁడే మఱల మీయత్త వారింటి కేగుము.

ఉ॥ దూరుదు నుండదే జనని • తూ యని తండ్రియు నుమ్మకుండునే
జారుఁ డటంచునిక్ మదిని • చాలగ దూరరె యత్తమామలుౕ

దూరరె చుట్టముల్ విడకఁ • దోయజ నేత్రలు గేలిఁజేయరే
చేరఁగఁ బొమ్ము నీసతినిఁ • జెప్పెద నీకిదె మేలుఁ గూర్పఁగన్. 38

బంగారు—నీవేమైన ననుము. నేను నిన్ను విడచి పోఁజాల.

సర్వ—(స్వగతము) వీని నింకను బాగుగ నమ్మించి పిదపఁ గోతిలోఁ ద్రోసెద. (ప్రకాశముగా) ప్రియా! నాకంటె నీభార్య చిన్నది గదా. నాకు వయస్సు కావచ్చినది ఆమెతో సుఖింపు చుండుము.

బంగారు—ఔను. నీకంటె చిన్నదే కాని దానినిఁ జూచిన నాకేమొ హేయ భావము జనించును. కారణము తెలియదు.

సర్వ—దానికిఁ గారణమా నీవామెకుఁ దాళిఁ గట్టితివి. అదియే గొప్ప దోసము.

బంగారు—ఆ గొడవతో మనకేల? మొదటి నుండియు నిన్ను నేను నమ్మితిని. నీవు నన్ను నమ్మి యున్నావు. కనుక నిన్ను విడువఁ జాల.

సర్వ—(స్వగతము) నీవు నన్ను నమ్మి యుండ వచ్చును గాని నేను నిన్ను నమ్ముటకు యవివేకు రాలను గాను. (ప్రకాశముగా) అయినను మీయత్తగారు నీకే మొసఁగిరి.

బంగారు—పెండ్లినాటి మాటా ? నడుగునది.

సర్వ—పెండ్లినాటి సంగతి నాకుఁ దెలియదా. నిన్నటి సంగతి.

బంగారు—నేనిప్పుడు ప్రస్తుతముఁ జేసి కొనననని చెప్పగనే రవలపోగులు రవలుంగరాలు యిచ్చిరి. గర్భాదానము నాడు గదిలోనికి వెళ్ళననగా గట్టి బంగరు మొలత్రాడొసంగిరి. ఇవిగో చూడుము. (అనిచూపును)

సర్వ—(ఉంగరములధరించి) సెట్టిగారూ! ఈవుంగరములు నాకు బాగున్నవా? నా బాగు నాకు తెలియదు. మీరు చూచు చున్నారు గదా! యెట్లులఁ గనఁబడు చున్నవి.

బంగారు—బహు అందముగ నున్నవి. (స్వగతము) అడిగిన నేమనునో! నాకు దక్కవు కాఁబోలు.

సర్వ—ఏమో ఆలోచించు చున్నారే. నే నీయననియా? మీ రిచ్చిన దీసికొందును గాని లేకున్న నాకెందులకు. ఇవిగో మీయుంగర ముల మీరుఁ దీసికొనుఁడు. (అని యియ్య బోవును)

బంగారు—అయ్యో! అవినాకేల నీ కొఱకయ్యె తెచ్చితిని. ఉంగరములే కాదు. పోగులఁ గూడ నీవే పెట్టుకొనుము.

సర్వ— మీరా చేతులార మీరేఁ బెట్ట వలయును.

బంగారు—అటులనే కానిమ్ము. (అని పోగులఁ బెట్టును.)

సర్వ—అన్నియు సరే కాని మొదట నేఁజెప్పిన కార్య మేమిఁ జేసితివి.

బంగారు—ఏది?

సర్వ—ఓహో! అప్పుడే మఱచితిరా? సరే. అయిన నిఁక మీ కిచటఁ బని ముగిసిన దని తలఁచెద. మీరిఁక వెళ్ళవచ్చును.

బంగారు—సర్వహారీ! ఏల తొందర పడియెదవు. నీకింత కోప ముండుట మంచిది కాదు. ఒకవేళ నేను మఱచిన దానిని నీవు జ్ఞాపకము నకుఁ దెచ్చిన తప్పు కాదు గదా.

సర్వ—ఎన్ని మారులు చెప్ప వలయును. చెప్పి చెప్పి నోరు కాయఁ గాచినది. మీరు వెళ్లినప్పుడు సొత్తుల సంగతిఁ జెప్పి పోలేదా?

బంగారు—అదేనా. నిజము నిజము. అయిన నొక పొరబాటు జరిగినది. ఎటుల నైన మోసగించి తేవలయునని ప్రయత్నముఁ జేసితిని గాని కుదరక పోయెను. అది సొత్తుల ధరించి పడక టింటికి వచ్చి నపుడు నిదుర పోవునేమో యని కాచికొని యుంటిని. దాని పాడుగాను కంటిపై ఱెప్ప నైనను వేసినది కాదు. నిదుర పోయి యుండెనా ఆభరణము లన్నియు నీవే యై యుండును. కానిమ్ము యిపుడు కాకున్న యింకొకపు డైనను యవి నీవి గాక పోవు. తొందఱ పడకుము.

సర్వ—మీ నిదానము మాకు రానేరదు. నాకుఁ జాలఁ బనులున్నవి. మీరు సెలవుఁ దీసికొనుఁడు.

బంగారు—సర్వహారీ! నీ వెంతకుఁ దెగించితివి. ఇట్టి దానవని కలలో నైనఁ దలఁచి యెఱుఁగ. నేను

సీ॥ అయ్య కొట్టినఁ గాని • యమ్మ తిట్టినఁ గాని
మోహించినాఁడ నిన్ను • మొదటి నుండి
ఆట పాటల కేగి • యలసి వచ్చిన వేళఁ
బాదము లొత్తితిఁ • బాగు గాను
ఇంటిలో సొత్తుల • నెప్పుడో దెచ్చితి
భార్య సొత్తులఁ దేగ • పాటుఁ బడితిఁ
జెప్పెడి పనులెల్లఁ • జేసితిఁ దప్పకఁ
జీట్లను మోసితి • సిగ్గు విడచి
తే. గీ. పడఁతి బోనాడి యింటిని • వంచ లోన
గ్రామ సింహము వలెయిల్లుఁ • గాయు చుంటి
ఒప్పు లేఁగాని యెన్నఁడు • తప్పుఁ జేయ
నన్ను బొమ్మనఁ జెల్లునే • నాతి నీకు. 39

సర్వ — నేను మాత్రము మీకేమి లోటొనరించితిని. మొదటినుండి యు నన్ను గని పెట్టుకొని యుండిన కుశాల్ రావును సహితము వదలి నీ వశమైతిని గదా.

బంగారు — నీవు లోటొనరించితివని యే గాడిద కొడుకనినాఁడు. నిన్ననిన వానినోట వజ్రదండ పురుగులు పడక పోవు.

సర్వ — అవును కాని ఆభరణములను మాత్రము త్వరలోఁ దెచ్చినను కాని లేకున్న మా యింటిపై యాస వదల వలసిన దే.

బంగారు — తప్పక తెచ్చెదను. ఆ దినమున పద్మను గుఱించి యేమియో జెప్పితివే. ఆ కార్యము నేమిఁ జేసితివి.

సర్వ — అది యొప్పుకొనలేదు. కానిమ్ము. దాని మాటా? మన మాటా? మీరు పోయి బలవంతము జేసిన తప్పక సమ్మతించును.

బంగారు — కానిమ్ము. అటులనే జేసెదను. (వినుట నభినయించి) అబ్బో నను జంపితివి. ఎవరో తలుపుఁ దట్టుచున్నారు. అమ్మయ్యో! ఇఁక గట్టిగ నఱచెదను, తలుపుఁ దీయకుము. చచ్చితి. చచ్చితి.

సర్వ — అరువకుము. తలుపుఁ దీయను లెమ్ము. ఏలభయపడెదవు పెఱటి త్రోవన యెవరి కంటఁ బడకుండ వెళ్లుము.

బంగారు—(పెఱటి త్రోవన నిష్క్రమించును)

ప్రవేశము:— పెఱటి త్రోవన కుశాల్‌రావు.

కుశాల్—ఏఁడెమె క్రొత్తగువ్వ యిలుఁ జొచ్చినదే.

సర్వ—పాతగువ్వ కిచట బనిలేదు. ఇచటినుండి తొలఁగ వచ్చును.

కుశాల్—నీ కెంత కోపమే. నిప్పుఁ ద్రొక్కిన పిల్లివలె యెగిరి పడె యెదవు.

సర్వ—అవును. క్రొత్తవారు వచ్చిన పిమ్మట మీతో మా కేమి పని.

కుశాల్—నీ పట్టిదానివి కావని నాకుఁ దెలియదా. అయిన వాఁడెందులకు వచ్చియుండెను.

సర్వ—(తనలో) ఎటులఁ దెలిసి కొనియెను. (ప్రకాశముగా) ఎవరు వచ్చియుండిరి?

కుశాల్—గుప్త వచ్చియుండలేదా.

సర్వ—వాఁడా! వచ్చియుండెను. నీ వెటులఁ జూచితివి.

కుశాల్—నీవు తలుపు త్వరగఁ దీయక పోయినందున పెఱటి త్రోవను వత్తమని వచ్చుచుండ, వాఁడు తలుపుఁ దీసికొని లుదుంగున బయటికి వచ్చెను. వాఁ డెందులకు వచ్చెనో చక్కగఁ దెలుపక పోయెను.

సర్వ—(స్వగతము) అతని రాకను గూర్చి అడిగియే యుండును. అతఁడు కోమటి బిడ్డగనుక అబద్ధముఁ జెప్పియే యుండును. (ప్రకాశముగా) చక్కగఁ జెప్పక పోయినను వంకరగనైనఁ జెప్ప లేదా?

కుశాల్—నీవు చెప్పరాదా.

సర్వ—నేనుఁ జెప్పిన మీకు నమ్మకమెటుల. అతఁడేమి జెప్పెను.

కుశాల్—దుకాణమునకు యియ్యవలసిన యప్పు నడుగుటకు వచ్చి యుండెనని చెప్పెను.

సర్వ—సరి మఱల నన్నేల యడిగితిరి.

కుశాల్—ఆ కార్యమునకు వచ్చియుండిన పెఱటిదారిన భీతమనస్కుఁడై వెళ్లు టేల?

సర్వ—నేనేమి చెప్పినను మీరు నమ్మరు. ఏమిజెప్పి యేమి ప్రయోజనము.

కుశాల్—ఏమి నీమాట నమ్మనివాఁడు నిర్మూలమై పోవును.

సర్వ—అటులైన వినుఁడు. అప్పనక్కై వచ్చిన వాఁడూరకుండక మన పద్మను జూచి యధిక ప్రసంగములఁ జేయఁ బోయెను. అది సహింపఁ జాలక రెండు లెంపకాయల వేసితిని. పిఱికి పంద భయముచే పెఱటి గుమ్మమునఁ బరుగెత్తెను. మే మెంత సత్యముఁ జెప్పినను నమ్మరు లెండు. ఇటీవల హీన జాతుల వారందఱు సానులై మాగౌరవము నుఁ బోఁగొట్టి నందున, మా పలుకులయం దెవరికిని విశ్వాసము కలుగుట లేదు.

కుశాల్—వేశ్యలలో హీన జాతివా రున్నారా?

సర్వ—మీకుఁ దెలియదుకాఁబోలు' మాయింటికివచ్చునరికి యెన్నిగుమ్మములఁ ద్రొక్కి యుంటిరో.

కుశాల్—తెలిసిన పోయి యుందునా? ఇప్పుడైన జెప్పుము.

సర్వ—ఎందులకు? ప్రాయశ్చిత్తముఁ బెట్టు కొనెదవా?

కుశాల్—లేదు. వినవలయునని కోరిక పుట్టినది.

సర్వ—చెప్పెద వినుము.

సీ. మేదర వీధిన • మేడలో నుండెడి
నీరద తానొక్క • నీలి ముండ
తోఁటల బజారున • తూఁగు టుయ్యాల లూఁగు
చంపక తానొక్క • సాలెముండ
కుమ్మర వాడలో • కులుకుచుఁ దిరిగెడి
మణిమాల తానొక్క • మాల ముండ
తురకల శ్రేణిలో • మెఱయుచు నుండెడి
వనజాక్షిఁ జూడలం • బాడి ముండ
తే. గీ. కుముద వర్ణంబుఁ జూడఁగా • కురప ముండ
రాజ కుల మెన్న గారంగ • రాజుముండ

ఇట్టి వారలు వేశ్యలై • యిట్టి పడఁగ
మాకు గౌరవం బనుమాట • మహిని గలదె. 40

ఈ కాలమున యిట్టివారల మాటలనే విశ్వసింతురు గాని మా పలుకుల నమ్మువారెవరు.

కుశాల్—అలాగా! నాకు మొదట దెలిసియుంచిన వారిని కన్నతల్లియైన జూచి యుండను.

సర్వ—మీరేగిన కార్య మేమాయె.

కుశాల్—ఇఁక నాలుగు దినములు దాటిన పిమ్మట రమ్మనిరి.

సర్వ—సరి బాగున్నది. నాకు పని యున్నది. ఇఁక మీరు వెళ్ళవచ్చును.

కుశాల్—ఎచ్చటికి?

సర్వ—మీయింటికి. ఇచట మీ కేమి పని యున్నది

కుశాల్—ఇంత నిర్దయయా,

సీ॥ తండ్రి గడించిన • ధన ధాన్య ములనెల్ల
కుయ్యక నీకునే • నియ్య లేదె?
మామగారొసఁగిన • మామిడి తోఫును
యెప్పుడో వ్రాసినీ • కియ్య లేద?
పోఁక వనంబును • తాకట్టు నేఁబెట్టి
నీయిల్లు ధనముతో • నింప లేదె?
భార్య ధరించిన • బంగారు నగలెల్ల
యిమ్మని నంతనే • నియ్య లేదె?
తే॥ గీ॥ వేరు వేరుగ వర్ణింప • వీలుఁ బడదు
నాదు సర్వస్వ మిచ్చినే • బీద నైన
యంతనే నన్ను బొమ్మన • వనద నగుచు
నెందుఁ బోదును నాకింక • యేరుదిక్కు.. 41

సర్వ—నీ వామాట యనిన నే నేమన నలయు. నీ చర్యలనే గోరంతలు కొండంతలుఁ జేసి చెప్పెదవు. నేను మాత్రము నీకు మోస మొనర్చితినా?

సీ॥ తాతల యాస్తిని • ధార బోసిన యట్టి
చిన్న శెట్టికి సాకుఁ • జెప్పి నాను
ఆలిని వదలిన • న్నాసించి పడియున్న
ఆచార్ల నావల • కంపి నాను
భూములఁ దెగనమ్మి • పోషించు చుండిన
తులసి రెడ్డిని బారఁ • ద్రోలి నాను
గాజులఁ జేయించి • ఘనత నహించిన
అయ్య వారిని యింటి • కనిపి నాను
తే॥ గీ॥ ఆదరించిన వారెల్ల • యాశ విడచి
పోవు లాగాన రించితి • బుద్ధి మాలి
ఇట్టి వాఁడంచు నిన్ను నే • నెఱుఁగ నైతి
దోన మున్నది నాయందు • దుష్ట బుద్ధి. 42

కుశాల్—నీవు ద్రోహము జేసితివని నేనంటినా? వారందఱుఁ గలిసి చేసిన పనులను నే నొక్కనినె జేయలేదా? తాతల యాస్తిని నీకర్పింపనా? ఆలినివదలి నీకు లొంగలేదా? నాభూముల నన్నిఁటిని విక్రయింపనా? ఎన్ని విధముల గాజులఁ జేయించినది నీకుఁ దెలియదా? నన్నిపుడు తొలఁగి పొమ్మనుటకు నోరెటులాడెను.

సర్వా—(స్వగతము) పాపము. ఇదంతయు నిజమె. పొమ్మని జెప్పుట న్యాయము కాదు గాని; మా కులచట్ట ప్రకారము పొమ్మనక తీరదు. అయిన నాకొకటి తోఁచు చున్నది. మా పద్మ మా వృత్తికి లొంగ కున్నది. ఇతనికి దాని పిచ్చి తలకెక్కించి దానిని త్రోవకుఁ దెచ్చునటులఁ జేయించెదను. (ప్రకాశముగా) అన్ని యుడిగిన నాతో నీకేమి కాని; మా పద్మ విషయమై మీరువ్వి ళ్ళూరు చుంటిరే. దాని మూఢత్వమును బాపి త్రోవకుఁ దీసి కొని రండు.

కుశాల్—అదెంతసేపు. నిమునములోఁ జేసెదను లెమ్ము.

[నిష్క్రమింతురు]

ఇది ద్వితీయాంకము.





# తుకారాం

## తృతీయాంకము

(ప్రథమరంగము)

ప్రవేశము —జీజీబాయి.

జీజీబాయి—

సీ. అన్య భామల యెడఁ • నాస జనింపని
పరమ యోగ్యుండు నా • ప్రాణ హితుఁడు
పరిహాస మునకేని • పరుసంబు లాడని
పరమ యోగ్యుండు నా • ప్రాణ హితుఁడు
పరులు నిందించినఁ • బదులు మాటాడని
పరమ యోగ్యుండు నా • ప్రాణహితుఁడు
ఆస్తి పోయిన గాని • యనృతంబు లాడని
పరమ యోగ్యుండు నా • ప్రాణ హితుఁడు
తే. గీ॥ బంధు వర్గంబు వీడిన • భయముఁ గనని
పరమ యోగ్యుండు గాఁడెనా • ప్రాణ హితుఁడు
పండరీపుర నాథుని • భజన విడని
పరమ యోగ్యుండు గాఁడె నా • ప్రాణహితుఁడు.

ఓరీ! మాస్వాజీబాబా! సాధుజన కంటకంబవని మే మెంచమైతిమి గదా. మఠాధిపతియను పేరేలఁ బెట్టి కొంటివి దురాత్మా! నీవు సన్యాసి వెటులైతివి. గోముఖ వ్యాఘ్రంబను నామము సార్థకము జేసి కొంటివి కదా. పొరఁబాటున మా గోవు నీ తోట యందుఁ బడినను మాకుఁ దెలుపక దానిని బడమార్చుటయేఁ గాక, నా ప్రాణప్రియుని, నిరంతర హరిసేవా ధురంధరుని, దురాత్ములగు నీ శిష్యవర్గము చేఁ గొట్టించితివే. ఆయన బుద్ధిపూర్వకముగ దానిని నీయారామమందుఁ దోలి యుండలేదు కదా. అట్టి వానిని దండింపఁ జేయుటకా సన్యాసివని పేరుఁ బెట్టుకొనిన నీకు మనసెట్లొప్పెను. నా భర్తను దండించిన దండించితివి గాక. నోరెఱుంగని గోవును జంపితివే. హిందువులందఱు గోవును పూజనీయ మైనదని భావించి మాతృభావమును జూపుచుండ నీ వాక్కారుఁడవు వీత మనస్కుఁడవై యమపురి కంపితివే. మ్లేచ్ఛులకు గోహంతకులను పేరుండెడిది. నీవిప్పుడు వారితో పాలుఁ బంచుకొంటివి. నీచా! నా భర్తను దేహమునుండి రక్తము వెలువడువఱకు బెత్తములతోఁ గొట్టించితి వఁట. ఆ మహానుభావుఁడు బదులు మాటాడక దేవాలయమున కేగి విఠోబా దేవుని ఆలింగనముఁ జేసికొని దుఃఖించుచు చున్నాఁడని చెప్పిరి. నే నేగి గృహమునకుఁ దోడ్కొని వచ్చి తగిన చికిత్స యొనరించెద (అనిపోఁబోవ)

ప్రవేశము—తుకారాం తంబుఱను చిటితాళమును వాయించుచు లోపలి నుండి.

గేయము.

ధరాతలంబున మురారి నీ ప్రజ
దురాత్ములై చెడు చుండఁగా
బిరాన నీ కని కరాన వారిని
వరా భాసంగియు బ్రోవరా ౧
పురేశ మఠాధిపు లరాతి వీరుల
పరంబునకై నను నేచఁగా

మురారి నీ వతి భరాన బ్రోచితి
కరంబునన్ నను వేడుక౯                                    ౨

జీజీబాయి—ఏమిది. నాథుఁడు దేవుని యొద్ద దుఃఖించుచు చున్నాఁడని వింటినే. ఇప్పుడు దైవ చింతనఁ జేయుచు వచ్చుచున్నట్లున్నది. నిదానించి చూచెద. (యొదిగి నిలచి యుండును.)

తుకారాం—(పై గేయమును బాడుచుఁ బ్రవేశించును)

జీజీబాయి—హా నాథా! (అని కౌఁగలించు కొనును)

తుకారాం—(ఆశ్చర్యము నభినయించి) నీ వెందులకు వచ్చితివి?

జీజీబాయి—మిమ్ములను మాన్వాజీబాబా శిక్షించి నాఁడనియు, మీరు దేవాలయమున దుఃఖించుచున్నారనియు విని గృహమునకుఁ బిలిచికొని పోదమని వచ్చు చుంటిని.

తుకారాం—ఓసి పిచ్చిదాన.

తే. గీ. కమల మిత్రుని కరములఁ • గట్ట వచ్చుఁ
నాకసంబు మబ్బుల కేగఁ • ప్రాక వచ్చుఁ
నగ్ని కణముల పై యాట • లాడ వచ్చు
భక్త వరులను శిక్షింప • వలను పడదు.                                    44

జీజీబాయి—అటులైన మాన్వాజీబాబా మిమ్ముల శిక్షించెనని పలువు రను చున్నారే. వీపు బ్రద్దలగునట్లు బెత్తములతోఁ గొట్టించి నది యసత్యమా?

తుకారాం—నిజమే. పాండురంగఁ డప్పుడే వాటిని మాన్పియున్నాడు. విఠోబా దేవునితో మొఱఁబెట్టు కొనుచు మూర్ఛ నొందితిని. పాండురంగఁడు స్వప్నమందు కనఁబడెను. లేచి చూచు వఱకు మునుపటి వలెనె బాగుగ నున్నాను

జీజీబాయి—(తనలో) ఇదేమి చిత్రముగ నున్నది. (ప్రకాశ) మీ చర్యలు వింతఁ గొలుపు చున్నవి. అది యటులుండ "కలవునం దధిక మాసమని నటుల" ఆదుష్టుఁడు మన గోవునుఁ జంపించి యున్నాఁడు.

తుకారాం.—ఏల భయఁపడియెదవు. ఒక వేళ నతఁడు చంపించి యుం డినను పాండురంగఁడు బ్రతికించుకొని తెచ్చి మనయింట విడచి పోవును లెమ్ము.

జీజీబాయి—ఇదెచ్చటనైన గలదా! గతించిన వాటిని బ్రతికించునా? మీకు పిచ్చి తలకెక్కినది. (అటునిటుఁ జూచి) నాథా! అదిగో చూడుఁడు. మన యావు బ్రతికి యింటికి వెళ్లుచున్నది. ఇంతకు ముందు చచ్చి పడియుండఁగా నేను కన్నులారఁ జూచి వచ్చి తిని గదా.

తుకారాం—నేఁ జెప్ప లేదా. మన పాండురంగఁడే దానిని బ్రతికించి యున్నాఁడు.

[ప్రవేశము—మాన్వాజీబాబా యిరువురి శిష్యులతో]

మాన్వాజీ—(కోపముతో) ఆ దురాత్ముఁడగు తుకారాముని శిక్షించి నను మఱల నెప్పటివలె నున్నాఁడఁట. గోవుమఱల బ్రతికి యున్న దఁట (ప్రక్కకు చూచి) అదిగో వాఁడిచ్చటనే యున్నాఁడు. ఇదే పోయి వాని ప్రాణములఁ గొనెద. (అని పైఁబడఁ బోవును)!

తుకారాం—(సమీపించి తన మెడనున్న తులసి మాలను మాన్వాజీ మెడను వేయును.)

మాన్వాజీ—మహాత్మా! క్షమింపుము. సేవకుని తప్పుల మన్నింపుము. (అని పాదములపైఁ బడును)

తుకారాం—అయ్యా! లెమ్ము. భగవంతుని పాదముల బట్టికొనుము. నీకు శుభమగును లెమ్ము.

మాన్వాజీ—స్వామీ! నేటినుండి నేను మీభక్తుఁడనైతిని. నా యప చారములను మన్నింపుడు. సెలవిండు. నే వెళ్లి మఱల మీదర్శనమునకు వచ్చుచుండెదను.

తుకారాం—శుభ మగుఁగాక. మంచిది వెళ్లుము.

జీజీబాయి—(ఆశ్చర్యముతోఁ జూచు చుండును)

తుకారాం—ప్రేయసీ! నీకొకమాటఁ జెప్పమఱచితిని. పాండురంగఁడు స్వప్నములో నాకు సేట్ తుకారామను పేరుఁ దగదని భక్తతు

కారామను నామమునిఁడు శ్రుతులను భాషాంతరీకరణ మొనర్పుమని సెలవిచ్చి యున్నాఁడు. ఆపనిని నేఁడే ప్రారంభింపుమనియె. నీవుఁ దాటియాకుల పాత్రమును గంటమును సిద్ధము చేయుము.

జీజీబాయి—చిత్తము.

(నిష్క్రమింతురు)

---

## ద్వితీయ రంగము

ప్రవేశము—సర్వహారి గృహమున గూర్చుండి యోచించు చుండ కుశాల్ రావు.

కుశాల్—ఔరా! సృష్టికర్త నేమని నిందించవలెను.

ఉ॥ ఎందఱి సుందరాంగులనొ • యీ భువి గాంచితి గన్నులార, నేఁ
బొందితి వార కామినులఁ • బుణ్యము పాపము లెక్క సేయకే
నొందును "పద్మఁ" బోలు సతి • నిమ్మహిఁ గానఁగ నైతి నక్కటా!
పొందుగ నా పతివ్రతను • బుట్టఁగఁ జేసెను వేశ్య యింటిలోఁ. 45

ఈ సర్వహారి యెంత మాయలాఁడి నిన్నటి దినమున నాతో సద్గుణ రాశి యగు పద్మను యేదో యొక నెపమున నా యింటి కంపెద ననియు, ఆమెను వేశ్యా వృత్తికి యెటులనైనను బురికొల్పు మనియు, ప్రోత్సాహ పరచెను. నేను దానికి లోఁబడి యుండుటచే ఆ కార్యమునకు సమ్మతించితిని. నేఁటి సాయంతనమున పద్మను బంపి యుండ, ఆ పాప కార్యమునకుఁ బురికొల్ప నెంతఁ బ్రయత్నించినను లొంగక పోయెను. నేనేమి చేయఁ గలను. ఇఁక నావలనఁ గాదని చెప్పెదను. (అని సర్వహారిని సమీపించును.)

సర్వ—(లేచి యెదురేగి చేయిఁబట్టుకొని) ఏమిఁ జేసితిరి. కాయా పండా?

కుశాల్—కాయ గాని పండెటు లగును.

సర్వ—ఏమీ ఒప్పుకొన లేదా?

కుశాల్—ఎన్ని విధములనో బ్రయత్నించితిని కాని ప్రయోజనము లేక పోయెను.

సర్వా—అయిన నీ చేతఁ గాదు కదా?
కుశాల్—నీ చేతఁ గానిది నా చేత మాత్ర మగునా.
సర్వా—పురుష జన్మమేల యెత్తితివి.
కుశాల్—సర్వాహరీ! ఈ మాటలతోఁ బ్రయోజనము లేదు. ఆ పని నాకు శక్యము గాదు.
సర్వా—నీవు పురుషుఁడవు కదా. ఏదైన యుపాయముఁ జెప్పుము.
కుశాల్—ఏ యుపాయము గలదు. (యోచించి) నా కొక యుపాయము దోఁచు చున్నది. మన యూర మఠగురువుగా నున్న రామేశ్వర భట్టు నా బాల్య మిత్రుఁడు. అప్పుడు పాఠశాల యందేమి, గృహము నందేమి వేయేల? సర్వకాల సర్వావస్థల యందు మే మొకటిగా నుండెడి వారము. అటులుండ నున్నటు లుండి మఠ గురు వొకఁడు మృతినొందెను. తగిన వారెవరు లేనందున సమీప బంధు వర్గములోఁ జేరిన నా మిత్రునికిఁ దలఁ గొరిగించి యజ్ఞోప వీతమును ద్రెంపి సన్యాసి నొనరించి పీఠము నెక్కించిరి. అప్పటి నుండియు నతఁడు మఠమున కధికారి యయ్యెను నేను వేశ్యవాడ కధికారి నైతిని. ఇటీవల నే నతనిని దర్శించుటయే లేదు కాని, నేఁడు మఠమునకు సమీపమున నుండు మఱియొక మిత్రుని కడకుఁ బోవు చుండ, మఠమున గూర్చుండి యోచించు చుండిన రామేశ్వర భట్టు నన్ను చేసైగతోఁ బిలచెను. ఇదే సమయమని వెళ్లితిని.
సర్వా—అదంతయు నాకేల. పద్మ సంగతి యున్నఁ జెప్పుము లేకున్న వెళ్ళుము.
కుశాల్—అంత తొందర యైనకష్టము చెప్పుచుండగ నేయంతకోపమా.
సర్వా—ఏమో తరువాత కానిమ్ము.
కుశాల్—వెళ్లి కుశలప్రశ్నము గావించి, యేమి యోచించు చున్నారే యని యడిగితిని. అంకలకాతఁడు మిత్రమా! ఇప్పుడు నా గౌరవము పోవు కాల మాసన్న మైనది. ఏమన తుకారాము శ్రుతుల నన్నిటిని స్వభాషలో వ్రాయు చున్నందున, ప్రజలు నేర్చుకొని

నా మాటలను విశ్వసించుట లేదు. నీకు నా యొద్ద మంచి యుద్యోగము యిప్పించెదను. తుకారామును వాటిని వ్రాయకుండఁ జేయు యుపాయము నొక దానిని జెప్పు మనెను.

సర్వ—నీ వేమంటివి?

కుశాల్—అదెంత సేపు. అన్నియు సరి జేసెద నంటిని. వెంటనే నాకతఁడు దివాన్ యుద్యోగము నిచ్చి యున్నాడు. కనుక రేపటి నుండి పనిలోఁ జేరెదను.

సర్వ—సరి. బాగున్నది ఇదేనా పద్మ సంగతి.

కుశాల్—అవునో. సాంతముగ వినక మాటాడిన నే నేమనఁ గలను.

సర్వ—ఇంకేమి చేయు మనియెదవు.

కుశాల్—నీవు ప్రతిదినము చీకటి పడిన తోడనే పద్మను వెంటనిడికొని తీర్థము నెపమున మఠమునకు వచ్చుచుండుము, నేనన్నియు సరిఁ జేసెదను.

సర్వ—సరే, అటులనె చేసెదను లెండు.

కుశాల్—నే నేగెదను. (అని పోవుచు)

తే. గీ. విప్రకులమున బుట్టి నే • వేశ్య యింట
దాస్యమును జేయు చుంటి యిం • దాఁక నిపుడు
తార్చు వానిగ మారితిఁ • దార్చుకున్న
వేశ్య తనయింటి లోనుండి • వెడలఁ గొట్టు. 46

(నిష్క్రమించును.)

---

# తృతీయ రంగము

ప్రవేశము:— మఠమునందు రామేశ్వరభట్టు పీఠముపై దిండును కానుకొని కూర్చుండియుండ. దివాన్‌జీ కుశాల్‌రావు కంబళముపైఁ గూర్చుండి యుండును.

రామేశ్వ—మిత్రమా! నీవేమైన తుకారామును గురించి ప్రజలేమను కొనుచుండినది నాకెఱింగింపఁగలవా?

కుశాల్—స్వామీ! మనము బాల్యమున మిత్రులముగా నుండి నపుడు పిలిచెడి రీతిని యిప్పుడు పిలుచుటతగదు. మీ రెంతైన మతగురువులు. ఎవరైన వినిన మీకు గౌరవము కలుగదు. తుకారామును గూర్చి చెప్పవలసిన సంగతులు పెక్కులుఁ గలవు. ఆయన శ్రుతులను స్వభాషలో వ్రాయుచుండుటఁ జేసి వాటిని ప్రజలందఱుఁ జక్కఁగఁ జదువు కొనుచున్నారు. మిమ్ముల గౌరవించుట లేదు. ప్రతిదినమాయన సంకీర్తనమునకు వేనవేలు జను లేగుటయే గాక ఆయన శిష్యు లగుచున్నారు. ఎన్నో యననేల తుకారామునే దేవునిగా భావించు చున్నారు.

రామేశ్వ—అవునా. నేనుఁ గూడ పలువురచే విని యున్నాను. అతఁడు శూద్రుఁడు. శ్రుతులు వేద గ్రంథములు. వాటిని స్వభాషలో వ్రాయుట కనర్హుఁడు. అయినను నా కొకటి తోఁచు చున్నది. శ్రుతులను వ్రాయుట నాపి వేయుమనియు, యిపుడు వ్రాసిన వాటిని మాత్రము ఇంద్రాణీనదిలోఁ బారవేయుమనియు యుత్తరువుఁ జేసెదను. వినక పోయిన బహిష్కార పత్రికను బంపెదను. ముందుగ వ్రాసిన పొత్తములను ఇంద్రాణీ నది కర్పింపుమని ఉత్తరువును వ్రాసి పంపుము.

కుశాల్—చిత్తము. అటులనేఁ జేసెదను.

రామేశ్వ—దివాన్‌జీ! అటులఁ జూడుము. ఎవరో యిరువురు స్త్రీలు మఠమున కేతెంచు చున్నారు.

కుశాల్—వారు వారాంగనలు. ముందుగ వచ్చునది వేశ్యమాత యగు సర్వహారి. రెండవ యామె సర్వహారి కూతురు. పద్మ యని పిలుచు చుండ విని యున్నాను. పతివ్రత యనుపేరు వడసినదని వాడుక యున్నది.

రామేశ్వ—అయ్యో! నీ వెంత యమాయకుఁడవు. ఆ పలుకుల విశ్వసించితివా?

తే॥ గీ॥ సంద్రమున గాంచు తీయని • జలము లట్లు
పన్నగము నోటఁ దేనెను • బడయు భాతి

కటికవానికి జనియించు • కరుణఁ బోలి
వారకాంతలలో గుణ • వతులుఁ గలరు. 47

కుశాల్—తెలిసిన వారికిఁ జెప్పుట యనుచితంబు గాకున్నను నాకుఁ దోఁచిన దానిని వెలిబుచ్చెద.

తే॥ గీ॥ వారి రాశిని రతనముల్ • బడయు నటుల
బొగ్గు గనియందుఁ గాంచెడి • భూరి వలెనె
ఖలుని కడుపునఁ బుట్టెడి • ఘనుని పగిది
వేశ్య కులమున గుణవతుల్ • వెలయు చుంద్రు. 48

ఇది నా యనుభవమును బట్టి తెలిసికొనినది. సత్యాసత్యములను బరీక్షింతురు గాక.

రామేశ్వ—దివాన్‌జీ! వారు సమీపించిరి. ఇచట వారికేమి పని యుండును. వారికిని మాకును కడు దూరము గదా.

కుశాల్—అది నా కెట్లుఁ దెలియును. మీరే యోచింపుడు.

రామేశ్వ—నాకు స్ఫురించుట లేదు. నీవే చెప్పుము.

కుశాల్—(యోచించి) మీ బోటి వారితో వారికేమి పని యుండును. బహుశా మీ దర్శనార్థమై యిచ్చటికి వచ్చు చుందురని నాకు దోఁచు చున్నది.

రామేశ్వ—వారికిఁ దగిన ప్రత్యుత్తరము నీవే యొసంగుము.

ప్రవేశము—సర్వహారి, పద్మ నమస్కరింతురు.

రామేశ్వ—శుభమగు గాక.

కుశాల్—మీ రిచటి కేల వచ్చితిరి.

సర్వ—స్వామి దర్శనార్థ మిచటి కేతెంచితిమి.

కుశాల్—దర్శనమైనది కదా. మీ రేగ వచ్చును.

సర్వ—స్వామీ! ఇది నా కుమార్తె పద్మ. దీనికి జబ్బుగా నున్నది. స్వాములవారు తీర్థ మిచ్చినచో నెమ్మది యగునని పలువురు చెప్పగా విని యిటకుఁ దోడ్కొని వచ్చితిని. నా కోరిక నెఱవేర్ప వలయును.

పద్మ—(తనలో) నా కేమియు దేహ మస్వస్థతగ లేదు. ఈ దురాత్మగురాలు యేమో పన్నుగడఁ బన్ని నన్నిటకుఁ దీసికొని వచ్చినది. ఈ వేశ్యాలోలుఁడును, దురాత్మగ్ర చక్రవర్తియు నగు కుశాల్ రావుఁ గూడ యిచటనె గావలి యున్నాఁడే. కానిమ్ము దేవుఁడే నాకు దిక్కు.

కుశాల్—మంచిది స్వామి తీర్థమిచ్చును ఆమెను ముందునకు రమ్మనుము.

సర్వ—(పద్మను ముందునకుఁ ద్రోయును. రామేశ్వరభట్టు తన ప్రక్కనుండిన తీర్థము నియ్యఁగా పద్మ యసమ్మతితోఁ దీసి కొనును.) (ప్రకాశముగా) స్వామీ! మేమేగ వచ్చునా?

కుశాల్—ఇంకను కొన్ని దినములు వచ్చి తీర్థమును దీసికొను చుండుడు. త్వరలో మీ కోరిక నెఱవేరును.

సర్వ—చిత్తము. (తనలో) మా కంతకంటె వేరు పనేమున్నది.

పద్మ—(కుశాల్ రావును జూచి) దైవమా! యీ కుశాల్ రావు నాకే ముప్పుఁ గలుగఁ జేయునో. నే నారోగ్యముగ నుండగనె నా తల్లి నన్నిచ్చటికిఁ దీసికొని వచ్చుటయు యీ విటాధముఁడు గూడ యిచ్చట నుండుటనదియుఁ జూడఁగా; వీరిరువురును నేదో యొక పన్నుగడఁ బన్నినటు లున్నది. కానిమ్ము, ప్రాప్తానుసారము జరుగఁ గలదు (సర్వాహరి పద్మ నిష్క్రమింతురు.)

కుశాల్—(తనలో) అబ్బా! నా కార్యము నెఱవేఱ గలదు.

రామేశ్వ—దివాన్‌జీ! వారిని మరల రమ్మంటి వేల?

కుశాల్—వారితో మనకుఁ గొప్ప కార్యము కావలసి యున్నది. ఆకార్యము గూర్చి నన్నిపుడు ప్రశ్నింపకుఁడు. నిలుకడ మీద మీకేఁ దెలియఁ గలదు.

(నిష్క్రమింతురు.)

## చతుర్థరంగము

ప్రవేశము—గృహము ముందటి భాగమున తుకారాం పులిచర్మముపైఁ గూర్చుండి యుండును.

తుకారాం—ప్రేయసీ! తాటియాకుల పుస్తకమును గంటమును గైకొని రమ్ము.

జీజీబాయి—(లోపలినుండి) చిత్తము. (అని తీసుకొని వచ్చును.)

తుకారాం—ఇచటఁ గూర్చుండి నేజెప్పు దానిని వ్రాయుచుండుము.

జీజీబాయి—నాథా మీ రీలాగున శ్రుతులను వ్రాయుచుండిన మీ కేమి లాభము గలదు?

తుకారాం—పిచ్చిదానా! లాభమునకా నేఁ జేయునది, ప్రజలకొఱకు. అదిగాక మన పాండురంగని యానతి మీఱ రాదని నీకుఁ దెలియదా?

జీజీబాయి—అవును. మంచిపాండురంగఁడు దొరికెను. ఆయనను నమ్మినందులకే మనకిన్ని కష్టములు ప్రాప్తించు చున్నవి. రాను రాను తినుట కాహారమే లభించుట లేదు. ఇఁక నైనను మీ పిచ్చి తలంపును మాని మఱల యేదైన వ్యాపారముఁ జేయుఁడు.

తుకారాం—మంచి యుపదేశ మిచ్చెదవు. సతి ధర్మ మిదియా?

సీ. శ్రీధరుఁ బూజించు • చేతులు చేతులు
నరసింహు వర్ణించు • నాల్క నాల్క
కమలనాభునిఁ గను • కన్నులు కన్నులు
సీతాపతికి మ్రొక్కు • శిరము శిరము
విష్ణు కథల్ విను • వీనులు వీనులు
మధుసూదనుని మీఁది • మనము మనము
భగవంతు కడ కేగు • పదములు పదములు
దనుజారి యెడనుండు • తలఁపు తలఁపు
తే. గీ. వేద బ్రకటించు నట్టిదే • విద్య విద్య
దనుజహాంతకుఁ జింతించు • దినము దినము

గరుడవాహనుఁ దెల్పెడి • గురువు గురువు
భవహరునిఁ జేరు మనియెడి • పత్ని పత్ని. 49

భర్త చెడు మార్గమునఁ బోవు చుండిన భార్య యతనిని మంచి మార్గమునకుఁ ద్రిప్పుట యామె విధియై యున్నది. నీవటులఁ గాక నన్ను భగవంతుని ధ్యానింపకు మనియెదవు.

జీజీబాయి—మీరు దేవుఁడు దేవుఁడని పలుమా రనెదరు కాని, మీరు చూచినది లేదుకదా. ఆయన మీబోటి వారికిఁ గనఁబడునా.

తుకారాం—ఆయనకు భేద మేమియు లేదు. భక్తియే ప్రధానము. ఒకని యందు ద్వేషమును మఱియొకనియందు ప్రేమనుఁ జూపు వాఁడు కాఁడు.

జీజీబాయి—అటులైన దేవుఁడందఱికి సమాన మేకదా.

తుకారాం—అవును.

జీజీబాయి—అప్పుడాయన సర్వులకుఁ గనఁబడుచు ప్రతిమానవునికి మోక్షమీయకుండుటకుఁ గారణ మేమి?

తుకారాం—కారణముఁ జెప్పవలయునా!

తే. గీ. కనమె కోర్కెలఁ దీర్పంగఁ • గల్పతరువు
కోరకుండిన యిచ్చునే • కొమ్మటంచుఁ
నడుగకుండిన వారిదే • యగును దోసగు
కల్పవృక్షంబునం దేమి • గలదు తప్పు. 50

కనుక ఆయనను శరణుఁ జొచ్చిన భక్తులను తప్పక రక్షించును. వారి యందలి గుణ దోసముల లెక్క సేయఁడు.

జీజీబాయి—శరణుఁ జొచ్చిన వారి నందఱి నొకటిగాఁ జూచు నంటిరే; భక్తులలో సహితము అనాచారముఁ జేయు వారుండిన నెట్లు?

తుకారాం—స్వలాభమునకుఁ బాటు పడక నిశ్చల భక్తితో భగవంతుని భజించు చుండినవాఁ డనాచార పరుఁడైనను ప్రశంసనీయుఁడే.

జీజీబాయి—అట్టి వానిని గౌరవించి పూజింప నచ్చునా?

తుకారాం—అటు లాచరించిన దోస ముండ నేరదు. మనకుఁ గావలసి నది జ్ఞానమే కదా.

జీజీబాయి—అది యటుండ నిండు. మీ రాయనను నిరంతర ధ్యాన మొనరించు చుందురే. మీరు చేయు ధ్యానమును దేవుఁ డెటులఁ దెలిసి కొనును?

తుకారాం—ఆయన తెలిసికొనఁగలఁడు. దేవుఁడు సర్వజ్ఞుఁడు. దేవునకుఁ దెలియని దుండదు.

జీజీబాయి—వైకుంఠమున శేష తల్పమునఁ బండి యుండు వాఁడెటులఁ దెలిసి కొనును.

తుకారాం—వినుము.

తే. గీ. ఇచటఁ గనుపించి మఱియుతా • నచటఁ బుట్టు
మాట లాడుచు నుండితా • మాయ మగును
ఆట లాడుచుఁ బరుగిడి • పాటఁ బాడు
నెచటఁ జూచిన విష్ణువే • యెసఁగు చుండు. 51

కొండంత యేనుఁగు మొదలు పిపీలికాది క్షుద్ర జంతువుల వఱకు దేవుఁడు నిండి యుండును. ప్రతి చోటను భగవంతుఁడుండి మన చర్యలను దిలకించు చుండ; ఆయన యెట్లుఁ దెలిసికొనఁ గలఁడనిన నేనేమనఁ గలను.

జీజీబాయి — ఆయన నెవరు నిందించునది యెవరుఁ బ్రశంసించునది తెలిసి కొనును గదా?

తుకారాం—అన్నిటి యందు నున్నాఁడు గనుక దెలిసికొని తీరుదు.

జీజీబాయి—నారాయణుఁడు చండాలునియందుఁగూడ నున్నాఁడుకదా?

తుకారాం—ఉన్నాఁడు. అతఁ డనుశాసితుఁడని తెలిసి కొనుము.

జీజీబాయి—ఏనుఁగులోఁ నుండఁ దగినంత గొప్ప యాకారముఁ గల వాఁడు చీమయం దెటుల యిముడ గలఁడు?

తుకారాం—భగవంతుఁడు దేని కేయాకారము తగినదో దానిని బొంది వాటికిఁ దగిన ఫల మిచ్చు చుండును.

జీజీబాయి—అటులైన దేవుని ననాయాసముగ ధ్యానింప వచ్చునే.

తుకారాం—అది సులభ సాధ్యము కాదు. (ప్రొద్దువంకఁ జూచి) ప్రేయసీ! చాల ప్రొద్దు పోయినది. తక్కంగల విషయము లిం కొక సారి దెలిసి కొందువు లెమ్ము. ఇపుడు వ్రాయ వలసిన దానిని వ్రాయుము. చెప్పదునా?

జీజీబాయి—చిత్తము. కానిండు. (అని గంటము తీసికొని తాటి యాకు పైఁబెట్టఁ బోవ చేయి వడఁకును). నాథా! నేఁడేమొ చేయి వడఁకు చున్నది, చూడుఁడు.

తుకారాం—అటులైన నేనే వ్రాసెదను లెమ్ము. (అని గంటమును దీసి కొని వ్రాయఁ బోగా చేయి వడఁకును.) ఏమిది నా చేయి కూడఁ జలించు చున్నది. కారణము తెలియ కున్నదే. ఈ దుశ్శకునము నకుఁ గారణము తెల్పువా రెవరు, పాండురంగా!
నీవే మాకుదిక్కు.

ప్రవేశము:—సేవకుఁడు కాగితముతో.

సేవకుఁడు—(తుకారామునకు నమస్కరించి) మహాత్మా! మత గురువగు రామేశ్వరభట్టు మీకీ కాగితమును బంపి యున్నాడు.

తుకారాం—(అందుకొని చదివి) హా! ఇంకెవరు దిక్కు.

జీజీబాయి—(భయముతో) నాథా! ఏమది. నాకుఁ దెలుపరాని సంగ తియా?

తుకారాం—(దుఃఖముతో) కాదు. వినుము చదివెదను. దేహూ,

తుకారాంజీ గారికి:—

మీరు శ్రుతులను స్వభాషలో వ్రాసి జనులకుఁ దెలుపు చున్నా రఁట. మీరు శూద్రులు. వాటిని వ్రాయ రాదు. ఇపుడు వ్రాసిన గ్రంథ మునను మా సేవకునితో మోయించుకొని వెళ్ళి ఇంద్రాణీ నదికి సమ ర్పింపుడు. ఇది మా యాజ్ఞ.

ఇట్లు,
మత గురువు రామేశ్వరభట్టు.

జీజీబాయి—నాథా! ఇట్టి విపరీత మీకలియుగమున నేనా లేక తక్కిన యుగములలోఁగూడ యుండెనిదా?

తుకారాం—గతయుగములలో యిట్టి విపరీతములుండినట్లు నేనెచ్చటను విని యుండలేదు. ఈయుగమున సహితమిట్టి పాపపుసంగతి వినలేదు ఈ నాచార మిటీవల వచ్చినటు లున్నది.

జీజీబాయి—ఇటులైన కవులు గ్రంథములను వ్రాసిన ప్రయోజనమేమి. వ్రాసిన దానినిఁ బ్రకటించుటకు వలను పడదా?

తుకారాం—అంతియే కదా మరి. ఇఁక మీదట స్వభాషలో గ్రంథములను రచింపఁ గూడదు. గ్రంథరచనకు గడంగినను యిట్టి కష్టములు ప్రాప్తించును. ఈకాలమున గవిత్వము నేర్చుటే యవివేక మగుచున్నది

జీజీబాయి—నాథా! ఇఁక గొన్ని దినములకుఁ విత్వ మటులుండ మాతృభాషను నేర్చుకొనుట దోసమగునేమో.

సేవకుఁడు—స్వామీ! ప్రొద్దుపోవుచున్నది. ఆగ్రంథములఁ దీసికొని నదికిఁ బ్రయాణము కండు

తుకారాం—అయ్యా! కొంచ మాగుము (భార్యనుజూచి) తరుణీ! ఈ కలియుగమున నిఁక ముందట్టి కాలము రాఁగలదు!

జీజీబాయి—నాథా! మీరిప్పుడేమి చేయఁదలంచిరి.

తుకారాం—ఏమి చేయుటకును దోఁచుటలేదు. ఆ పాండురంగఁడే గతి (సేవకునిజూచి) అయ్యా! నాయందు కరుణఁ గలిగి గురువు కడకేగి యిటులఁ జెప్పుము. నాకుటుంబమున నెవరి ప్రాణములనైన నొసఁగుటకు సిద్ధముగ నున్నాను. దయయుంచి నా గ్రంథరాజములఁ గాపాడు మనుము

సేవకుఁడు—అయ్యా! అదంతయు నాకుఁ దెలియదు. త్వరితముగ వాటిని నా కప్పగింపుడు. ఆలస్యమైన మాగురువు నన్ను దండించును.

తుకారాం—అయ్యా! కవికి తానుజేసిన గ్రంథము తన సంతానము వంటిది కదా! గ్రంథమును నది కర్పింపుమన్న నా ప్రియ పుత్రి

కను నది పాలు గావింపు మనుటయే కదా. నా ప్రథమ పుత్రిక నొసంగెదను. తీసికొనివెళ్లి మీ గురువు గారి కర్పింపుము.

సేవకుఁడు—అది నాకు సరిపడదు. నాకు గ్రంథముల నదియందు బార వేసి రమ్మని జెప్పియున్నారు. నేనా కార్యము జేసి పోవలసి యున్నది. తక్కిన గొడవలన్నియు నా కేల?

తుకారాం—ఇంతనిర్దయ వహించిన నే నేమనఁగలను. అటులనేఁ జేసె దను లెండు (భార్యను చూచి) సఖి! నీవు గృహమున కేగుము, నేను త్వరలో వచ్చెద.

జీజీబాయి—చిత్తము. (నిష్క్రమించును)

సేవకుఁడు—ఆ కార్యము నా యెదుట జరుగవలసి యున్నది. నేఁబో యిన మీ రా పుస్తకములను దాఁచిన నెట్లు?

తుకారాం—అంతటి మోసము నే జేయువాఁడను కాను. అటులనేఁదీసి కొని వచ్చెదను. (అని గ్రంథముల మూటఁ దలపైన నిడుకొని ప్రయాణమగును.

సేవకుఁడు—స్వామీ! నేను మోసికొని వచ్చెదను. ఆమూటను నా తల పైఁ బెట్టుడు.

తుకారాం—నాయనా! నాబరువు నాతలపైన నే యుండనిమ్ము. ఆ కష్ట ము నీ కెందులకు (తుకారాం ముందు సేవకుఁడు వెనుకఁ బోవు చుందురు.) పాండురంగా! నీ ప్రభావ మిపుడు గదా తెలియఁ గలదు. ఏమిఁ జేయుదువో జూచెదఁగాక.

క. కాచితివి సకల జనులను
యాచన మొనరించి నపుడె • యలసట లేక\
తోఁచదె ననుఁ గాపాడఁగ
నీచుఁడ నీసేవకుండ • నిర్జర వినుతా. 52

సేవకుఁడు—మహాత్మా! ఇంద్రాణీనది సమీపించినది కదా. ఇఁక పుస్త ముల నందుఁ బార వేయుఁడు.

తుకారాం—(దుఃఖముతో) అయ్యో! నా పుత్రికారత్నమును నా చేతు లార గంగాభవాని కర్పింపు మనిన నాచే నగునా. నీ పుత్రిక

కుత్తుక నీవుఁ గత్తిరింపఁ గలవా? ఆ కార్యము నీ గురువగు రామేశ్వరభట్టు చేయఁగలఁడా? ఎంత దుఃఖించిన నేమి ప్రయోజనము. ఈకార్యముఁ జేయక తప్పదుగదా. ఆజ్ఞను నిరాకరించిన బహిష్కార పత్రికను బంపును. మతగురువు యాజ్ఞఁ దిరస్కరించి బ్రతుకఁ గలనా. పాండురంగా! అనాదరక్షకా! ఆపద్బాంధవా! రమ్ము, నన్ను రక్షింపుము నా పుత్రికను గాపాడుము. ఎన్ని విపత్తుల నుండియో నన్నుఁ గాపాడితివే. ఇప్పు డెచ్చట నున్నావోకదా తల్లి! గంగాభవానీ! నా గ్రంథ రాజములను నీవైన గాపాడుము. భారతమాతా! నీవిట్టి మతగురువుల నెందులకుఁ గంటివో కదా. భరత ఖండమున హృదయము నందున్న దానిని గ్రంథ రూపమునఁ బ్రకటించుటకు వీలుఁ గాకున్నదే. భాషామతల్లిని సేవించు మాకరములకు సంకెలలు వేయుటకంటె మా కరముల ఖండించిన బాగుండునే. ప్రేమతో వ్రాసిన గ్రంథ రత్నముల నాశన మొనరించుట కంటె ముందుగనె మాబొటన వ్రేలిని గత్తిరించిన యీ దుఃఖము మా కుండకుండెడిదే. ఇట్టి గ్రంథనాశన మొనరించు దురాత్ము లెన్నడు గతింతురో అప్పటి వఱకుఁ గవుల కష్టములు పోయవు గదా. అబ్బా! నా చేతులార యీ గ్రంథముల నెట్టులఁ బారవైతు. ఈ కరములే వ్రాసెను. వీరిల నిప్పుడే పారవేయుటచే యెంత పాపముఁ జేసి కొన్నానో గదా. (నీటిలో వేయఁ బోయి) కాదు. నా చేతఁ గాదు. నే వేయఁ జాలను. నా బిడ్డను నే జంపఁ జాలను. (సేవకునిఁ జూచి) అయ్యా! నీ పుణ్యమగును. మీకు శ్రమఁ గలిగించినందులకు నన్ను క్షమింపుడు. నా యందు దయయుంచి యీ కార్యమును మీరేఁ జేయుఁడు.

సేవకుఁడు—ఇటు తెండు.

తుకారాం—తీసి కొనుఁడు. (అని మూట నిచ్చును.)

సేవకుఁడు—(నదిలో వేయును.)

తుకారాం— (హాయని మూర్ఛిల్లును.) (గ్రంథముల మూట వెలుపలఁ బడును. సేవకుఁడు మూఁడు సారులు వేసినను వెలుపలఁ బడగా; ఆశ్చర్యముతోఁ జూచు చుండ తుకారాం లేచును.)

సేవకుఁడు—(తుకారాం పాదములపైఁ బడి) స్వామీ! నన్ను క్షమింపుడు. నా బుద్ధిపూర్వకముగఁ జేసిన వాఁడను కాను. గురువాజ్ఞ నెఱవేర్పకఁ దప్పినది కాదు. నే నిదే వెళ్ళి జరిగిన సంగతి మా గురువు గారి కెఱింగించెదను. సెలవిండు.

తుకారాం—నాయనా! నీ వేమి చేయఁ గలవు. నీ తప్పేమియు లేదు. వెళ్లుము.

సేవకుఁడు—(నిష్క్రమించును.)

తుకారాం—(గ్రంథములఁ దీసి కొని)

గే య ము,

[ధరాతలంబున మురారి నీవ్రజ - అను గేయమును పాడుచు నిష్క్రమించు ను.]

ఇది తృతీయాంకము.





# తుకారాం

## చతుర్థాంకము

[ప్రథమరంగము.]

ప్రవేశము:—శివాజీ మహారాజు సింహగడ దుర్గారణ్యమునఁ బ్రయాణ సన్నాహుఁడై పోవుచు.

శివాజీ—సీ. అనియందుఁ బోరాడి • అఫ్జలు ఖానుని
నరక కూపమునకేఁ • దఱిమి నాఁడ
పట్టి సర్ గొంపోవఁ • బ్రతినఁ బూనిన యట్టి
షేస్త ఖానుని దివిఁ • జేర్చినాఁడ
బలిమి నన్ వధియింపఁ • బరతెంచి నట్టి యూ
జస్వంత సింగును • జంపి నాఁడ
డంబముల్ గొట్టెడి • డయిలను ఖానుని
బలిఁగొని యముఁ జూడఁ • బంపి నాఁడ

తే. గీ. తురక సేనను బట్టి నేఁ • దుండ్లు తుండ్లుఁ
జేసి వైచితి నేను న • జేయుఁ డనని
నెఱిఁగి యౌరంగ జేబు తా • మఱచి పోయి
బోర నూహించె నాతోడ • బుద్ధి లేక.

రణ రంగమున విచ్చల విడిగఁ దిరిగి యోధులను జక్కాడితిని. మ్లేచ్ఛులు నా బారి కోర్వజాలకఁ అనేక సారులు పరాజితులై పారి పోయిరి. రణరంగమునఁ బగతుల ప్రాణములఁ దీసితిని. నిండు ప్రాణముల దీసి నందున నా కెంతపాపము రాఁగలదో. పాప పరిహారార్థము నా గురువగు తుకారాం కడకేగి ఆయన సేవఁజేసి, ఆయన యభంగము లను విని నాకర్ణములను పావనముఁజేసి పాపమును బోగొట్టుకొని రా వలయు నని ప్రయాణమై వచ్చితిని. నేను లేకుండు సమయమునఁ బగ తులు కోటనుముట్టడింతురేమో. మహమ్మదీయు లెప్పుడును మోసము గనే వత్తురు. (ఆలోచించి) "జౌనది కాక మానదు" నా గురువును దర్శించి చాల కాలమైనది. ఇంతకంటె మంచిసమయము దొరకనేరదు. ఆయన పూనాలో నున్నాఁడని విని యింత దగ్గరకు వచ్చి తురకలకు భయఁపడి తిరిగి సింహగడమునకుఁబోవుట తగదు. ఇపుడు రాజ్యముపై నుండు భ్రాంతిచేఁ బోయిన నొకవేళ యుద్ధము తటస్థించినఁ బోరవలసి వచ్చును. దినములు మంచివి గాక రణమునఁ గూలిన గురువును నెటులఁ జూడగలుగుదును. కనుక ఆమహాత్ముని దర్శించియే పోవలయును. ఇఁక పూనా యెంతో దూరము లేదు. మేడలును గోపురములును కనఁబడు చునే యున్నవి. ఇపుడే వెళ్ళి ఆయనను దర్శించి వచ్చెద.

(నిష్క్రమించును.)

ప్రవేశము:—తుకారాం పూనా యందలి దేవాలయమున భజనఁ జేయు చుండును.

తుకారాం—సీ. పాండురంగనిఁ జూచి • పలుమారుఁ బొగడని
పురుషుండు పురుషుఁడే • తరువు గాక
పాండురంగని నామ • పఠనంబుఁ జేయని
పురుషుండు పురుషుఁడే • పురుగు గాక
పాండురంగని పాద • పద్మముల్ బట్టని
పురుషుండు పురుషుఁడే • పోతు గాక
పాండురంగని తీర్థ • పానంబుఁ జేయని
పురుషుండు పురుషుఁడే • పులుగు గాక

తే. గీ. పాండురంగని కథలను • భక్తి వినని
పురుషుఁ డేరీతి పురుషుఁడౌ • నరకు గాక
పాండురంగని సేవను • వడి సలుపని
పురుషుఁ డేరీతి పురుషుఁడౌ • మొరకు గాక. 54

పాండురంగా! మహానుభావా! భక్తుల పాలిటి కల్ప వృక్షమా! రక్షింపుము. రక్షింపుము.

ప్రవేశము:—శివాజీ.

శివాజీ—స్వామీ! మీశిష్యుని వందనముల గైకొనుఁడు. (నమస్కరించును.)

తుకారాం—(తలపై కరమునిడి) నాయనా! శుభమగు గాక. ఎప్పుడు వచ్చితివి.

శివాజీ—కేవలము మీ దర్శనార్థమై యిప్పుడే వచ్చితిని.

తుకారాం—నాయనా!

చ. సేమమె నీదు తల్లియును • చిన్నలు పెద్దలు బంధు వర్గముల్
సేమమె నీ సతీమణియు • సేమమె అత్తయు మేనమామయున్
సేమమె నీదు సేనయును • సేమమె కోటయు సూనులందఱున్
సేమమె నీ ప్రజాళియును • సేమమె నీకును వేగఁ జెప్పుమా. 55

శివాజీ—స్వామీ! పాండురంగనాథుని కృపయు, మీ యాశీర్వచనమును జక్కగ నుండ నాకేమి కొఱంత యగును. అందఱము క్షేమముగ నున్నాము.

తుకారాం— వత్సా! (కొంత మాలోచించి) నీ విచటికి వచ్చుట తప్పు. ఇట్టి సమయమున రాకూడదు. ఏమో నాయందు నీకుండు భక్తిచే వచ్చి యున్నావు బదులు మాటాడక సింహగడమునకు ఆలస్యముఁ జేయక వెడలుము. నన్ను దర్శించుటకు వచ్చితివి. నాదర్శన మైనది. నిముసముకూడ దారియందు ఆలస్య మొనరింపకుము. నేను గూడ యీ గ్రామమును రేపటి దినము విడుతును.

శివాజీ—మీయాజ్ఞ మీరఁగలనా. ఇదేవెళ్లుచున్నాను. ఆశీర్వదింపుడు.

తుకారాం—జయమగుగాక. వెళ్లుము. (నిష్క్రమించును)

శివాజీ—స్వామి నన్నేలనో వెంటనే కోటకేగుమని యానతిచ్చి యున్నాఁడు. కారణ మడుగుద మనుకొనిన బదులు మాటాడకు మనియె. నాయందు కోపము జనించి యుండునా? అయ్యో! నేనెంత పొరబడితిని. ఆయనకుఁ దన శత్రువులపై నను కోపము లేకుండు తఱి నాయందుఁ గలుగునా. ఎన్నటికిని గలుగ నేరదు. ఇందేదో రహస్య మున్నది. ఆ మహానుభావుఁడు నా మేలుఁ గోరియే నన్ను బొమ్మనెను గాని వేరు కాదు. "తినబోవుచు రుచి యడుగ నేల" నాదుర్గముఁ జేరిన తోడనే సర్వము విశద మగును గదా. ఏదో యొక గొప్ప శుభకార్యమైనను జరుగఁ బోవును. లేక విపత్తైనను కలుగ వలెను. లేకుండిన నన్నింత త్వరితముగఁ బంపి యుండడు. ఇఁకఁ గడవు సేయక వెళ్లెదను.
(నిష్క్రమించును.)



# ద్వితీయరంగము

ప్రవేశము:—శివాజి అరణ్యమార్గమున సింహగడ దుర్గమునకుఁ బ్రయాణముఁ జేయుచుండును.

శివాజి—ఔరా! అప్పుడె యెంతదూరము ప్రయాణముఁ జేసితిని. ఎంత నడచినను యలసట తోఁచుట లేదు. నాకాశ్చర్యముగ నున్నది. ఇదంతయు తుకారాంప మాయ గాక వేరేదియుఁ గాదు. (అని క్రిందఁ జూచి అచట బడియున్న కాగితమును దీసికొని) ఇది ఇచటఁ బడుటకు కారణ మేమై యుండును. బాటసారు లెవరైన బారవేసుకొని పోయియుందురా. (బాగుగ ద్రిప్పిచూచి) ఇంతకు ముందెఁ బడినటు లున్నది. దీనిని విప్పి చదువుదునా. పరుల కాగితములను చదువుట తప్పుగదా. అడవిలో పడియుం

డిని దానిని చదివిన దోషమేమి. చదివెదను. (అని చదువుకొని
తలయూచి కోపముతో.)

శా. ఓరా! యేమనవచ్చు నీదు తెగని • గ్గయ్యారె వింతాయె ని
చోరత్వంబునఁ బోరు సాహసము లే • శూరోత్తముఁ గెల్తువే
ఓరీ! మ్లేచ్ఛకులాధమా! వెడలఁ • వున్నాఁడవా యింక నీ
ధీరాగ్రేసరు చేతఁ జిక్కితివి నీ • దిక్కెవ్వరో చూచెదఁ. 56

(యోచించి) దీని నెవరో నా కొఱకై వేసినటు లున్నది. మహామ్మదీయులు నా దుర్గమును ముట్టడించి యున్నారఁట. ఇది సత్యమై యుండునా. సత్యమైన నాకుఁ దెలుపుటకై వ్రాసిన యీ లేఖను నా కొసఁగక యిచట వేసి పోవుటకుఁ గారణ మేమి. ఎవఁడో పగవాఁడు యీ కుట్రను బన్ని యుండును. ఈ కాగిత మిప్పుడే పడి యున్నది గాన వేసిన వాఁడు కూడ సమీపముననె దాఁగి యుండును. వెదకి నిజమును దెలిసి కొనెద. ఏదైన మోసముం జేసిన వానిని బట్టి భూత బలిఁ గావించెద. (అందందు వెతకి) ఎవ్వరును లేరే? ఇది దైవ మాయ గాక వేరు గాదు. తుకారాంజీ మంచి సమయమునకు నన్నుఁ బంపెను. ఆలస్య మొనరించి యుండిన యీ కమ్మ యితర బాట సాగుటకుఁ జిక్కి యుండును. ఇఁకఁ దడవు సేయ రాదు. ఇప్పుడే దుర్గమున కేగి తురుష్క సేనలను దునుమాడెదఁ గాక. ఓరీ! మ్లేచ్ఛకుల పాంసనా! నె దుర్గమున లేనప్పుడు మోసమున ముట్టడించితివా? ఇది తురుష్క ధర్మము కాఁబోలు. ఎక్కడి ధర్మము. ధర్మ మెచ్చట దాఁగి యున్నదో. తల్లీ! ధర్మ దేవతా!

సీ॥ వేశ్యల యెంగిలి • పెదవులఁ జవిఁ జూచు
విప్రులఁ జూడంగ • వెఱచి నావొ
ధనమున కాసించి • తప్పు సాక్ష్యము లిచ్చు
వారలఁ గనినంతఁ • బాఱె నావొ
భంగు పానముఁ జేయు • పామరులంజూచి
ఛీ యని యడవులఁ • జేరి నావొ
సారాయి త్రావంగ • సైపఁ జాలక వారిఁ
గన దోసమని నీవు • కదలి నావొ

తే. గీ. భూసురులకడఁ జోటింత • పొసఁగ లేదె
భరత ఖండంబు నేటికిఁ • బాడు వడెనె
నెలవు లేదాయె నేనీకుఁ • దలఁపఁ దల్లి
ధర్మ దేవత! నీవెందు • దాఁగి తమ్మ. 57

ధర్మాధర్మముల లెక్కించుచుఁ గూర్చుండుట కిది సమయము గాదు. ఓరీ! మూఢాధములారా! అఖర్వ గర్విత మానసులై మదీయ దుర్గ వినాశమునకు దొరకొంటిరా? మదీయ నిశిత క్రూర కృపాణ సముత్పాతంబైన ఘాతకు డీకొనఁజాలక యెన్ని పర్యాయములు పరాజయము నొంది పాఱిపోయితిరో మీ రెఱుఁగరా? పరుగిడిన మీరు మఱచిన మఱతురు గాక నే నెట్టుల మఱువఁ గలను. పాఱుఁబోతు తనంబునఁ బ్రఖ్యాతి వహించిన బంది పిల్లల కంటె మీ రేమెక్కువ? శివాజీ ఖడ్గ ధార కోర్వఁ గలరా? సింహగడ దుర్గమంత యవలీలఁగ లోఁబడు నది కాదని మీ రెఱుంగరా? మా యోధాగ్రేసరుల పరాక్రమములు మీ రెఱుఁగరు కాఁబోలు. పరదేశమునుండి వచ్చి మా భరతఖండమునఁ జేరినదే గాక; మాపై స్వారిఁ జేయఁ దలంచెదరా? మా భరతఖండ మంత లోకువాయెనా? మేము భరత మాతకు జనింప లేదా? మీ దేశమాతఁ బోలె మా భారతమాత పిఱికి పందలను గన లేదని యెరుఁగఁ జాలక పోతిరా? మా తల్లి యశమును పాడుచేయు మాతృద్రోహులము కామను సంగతి మీ పెద్దలకేఁ దెలిసి యుండ మీ రెఱుఁగరా? అమ్మా! భారతి జననీ! నీ పుత్రునిఁ గాపాడుము. నీ సూనుఁడు మనియున్న నిన్ను బంధ విముక్తురాలినిగ నొనరింపక పోఁడు. తల్లీ! భారతాంబా!

సీ॥ పగతులఁ గనినంతఁ • బట్టి చెండాడెడు
మహారాష్ట్ర వీరులు • మనుచు నుండ
సింహ శార్దూలాది • చెడు మృగంబులఁ జంపి
యుద్ధరించెడు మేటి • యోధు లుండ
కరితుండ ములఁబట్టి • కరలాఘ వంబున
విదళించు రసపుత్ర • వీరు లుండ

మ్లేచ్ఛ యోధులఁ గన్న • మేదినిఁ బడవైచి
చించి రక్తముఁ గ్రోలు • చెంచు లుండ
తే. గీ. ప్రాణముల లెక్కఁ సేయని • పౌరులుండ
సింహగడ దుర్గమున నేనుఁ • జెలఁగు చుండ
కరము నందు భవానియన్ • ఖడ్గ ముండ
భారతాంబరో! నీకేటి • భయము తల్లి. 58

ఓరీ! దేవ బ్రాహ్మణ పతివ్రతా తిలకముల పాలిటి కంటకము లగు తురుష్కాధములారా! మూపై కావలయునని కత్తిఁగట్టుటకు మే ము మీావలె

సీ. దేవాలయముఁ జొచ్చి • దేవుని బడఁ ద్రోసి
ధనరాసి హరియింపఁ • దలఁచి నామె
పాపం బెఱుంగని • బ్రాహ్మణులన్ బట్టి
తలఁ గొరిగింపఁగాఁ • దలఁచి నామె
దారినఁ బోయెడి • దారలఁ జెరఁ బట్టి
బలిమిమై జెరుపంగఁ • దలఁచి నామె
సకల జనావళియు • సమ్మతిఁ బూజించు
గోయూధముల గొంతుఁ • గోసి నామె
తే. గీ. జుట్టునకుఁ బన్నుఁ దీయఁగా • జూచి నామె
సాధు జనులను బరిమార్పఁ • జాలి నామె
దొంగలను బంపి దారుల • దోఁచి నామె
పగతులం జూచి రణమునఁ • బాఱి నామె 59

మే మూరకున్నందున గదా మీరు కయ్యమునకు కాలుఁ ద్రవ్వుట. మే మబలల మనుకొంటిరా? మూతిన మీసములు లేవని దలఁచితిరా? సమయము వచ్చిన మీావలె గాజుల ధరించి ముసుగు వేసికొని గోషాస్త్రీలలో దాఁగెడి వారము కామని మీారు తెలియఁజాలరా? ఓరీ యౌరంగాజేబా! పరాక్రమలవదుర్విదగ్ధా! నీవిఁక నా బాఱినుండి తప్పించుకొని పోవుట కల్ల. నిన్ను మదీయ తేజోనలంబున కింధనంబుఁ గావింపకఁ బుత్తెంతు ననుకొంటివా? మత్తేభకుంభవిదారణ పరిష్ఠంబగు సింహ

రాజము వంటి శివాజీతోc బోరc గలవా? త్వదీయ భట సర్గంబులc జించి చెండాడి నిస్సహాయ ధామమొనరింపకున్న; మీరు నా దాడి కో ర్వం జాలక భీతిచే నన్ను మెచ్చి యొసంగినట్టి నా మహారాజ నామము గాల్చనా? మదాంధా! కదన రంగమున మత్ప్రతాప వహ్ని జ్వాలల మిమ్ము దహింపక విడతునా? ఓరీ! యిదే వచ్చుచున్నాcడను. పాండురంగా! గురు సత్తముండవగు తుకారామస్వామీ! నా రాక తురుష్క చక్రవర్తి కెఱింగింపుడు. జాగ్రత్తc గలిగి పోరుటకు సంసిద్ధులై యుండమనుcడు. మోసమున వచ్చి మమ్ము జయించెనని వారనిన ఆ యపకీర్తిc బడయc జాలను. రణరంగమున జయమును గలుగc జేయుcడు. భారత మాతా! నన్నుc గాచి కొనుము. సమర రంగమున వైరుల జక్కాడి జయముc గాంచి వచ్చెద లేదా! బవరమునcబోరి శూరజనైక శరణ్యంబగు వీర స్వర్గమొన నందెద. ఔరంగజేబ్!

మ. పలువా! నీచకులాధమా! వినవె నా • వాక్యంబు సుంతేని నీ
    విలలో నుండcగc జాల వింకc గను ని • స్సీనాడె ద్రుందించెదర్
    నిలువన్ జాలకc బాఱి పోనకుము రా • నెనిప్పుడే వచ్చి నీ
    యులుకున్ శాపగ లేక పోయినను నే • నొక్క-య్య పుత్రుండనే 60

(నిష్క్రమించును.)

---

# తృతీయ రంగము

ప్రవేశము:—మతగురువగు రామేశ్వరభట్టు దివాన్ కుశాల్ రావు మఠమునc గూర్చుండి యుందురు.

రామేశ్వ—దివాన్ జీ! తుకారామునకు ఉత్తరువుc బంపి యున్నావా?

కుశాల్—చిత్తము ఆనాcడేc బంపి యున్నాcడ.

రామేశ్వ—ఏమి పత్యుత్తర మిచ్చి యున్నాcడు?

కుశాల్—ఇంకను యే సంగతి తెలియదు.

రామేశ్వ—గ్రంథములను నది కర్పించెనా లేదా?

కుశాల్—అది కూడ తెలియ లేదు.

రామేశ్వ—నీవు పంపిన సేవకుఁ డింకను రా లేదా ?

కుశాల్—ఇంత వఱకు రా లేదు. నేఁడు తప్పక రాఁగలఁడు.

రామేశ్వ—రాకుండుటకుఁ గారణ మేమై యుండును ?

కుశాల్—త్వరలో తెలియఁగలదు.

ప్రవేశము:—సేవకుఁడు.

సేవకుఁడు—స్వామీ ! నమస్కారములు

రామేశ్వ—ఓరీ ! నీ వెప్పుడు వచ్చితివి.

సేవకుఁడు—ఇప్పుడే వచ్చితిని.

దివాన్‌జీ—తుకారామునకుఁ గాగితము నిచ్చితివా ?

సేవకుఁడు—ఇచ్చితిని.

దివాన్‌జీ—గ్రంథములను నదిలోఁ బడవేసెనా ?

సేవకుఁడు—వేసెను గాని—(అర్థోక్తి)

దివాన్‌జీ—ఏమి? జరిగిన దంతయుఁ దప్పక విశదముగఁ జెప్పి వేయుము.

సేవకుఁడు—నేను కాగితము నిచ్చిన తోడనే చదువుకొని మిక్కిలి దుఃఖించెను. పాండురంగని యనేక మారులు ప్రార్థించెను ఆయన వేయకఁ దప్పదుఁ జేయు చున్నాఁడను బలవంతమున గ్రంథముల నొకొని నదిలో వేసితిని. స్వామీ ! యేమి చెప్పు దును. ఎన్ని మారులు వేసినను మరలఁ బయటఁ బడుచుండెను. కొంచ మైనను తడువ లేదు. ఇఁక ప్రయోజనము లేదని తిరిగి వచ్చితిని, ఆ మహానుభావుఁడు వానిని మరలఁ దీసికొనిపోయెను.

రామేశ్వ—ఛీ. ఆ శూద్రుని మహానుభావుఁడని యెదవు (కుశాల్ రావు నుఁ జూచి) దివాన్‌జీ ! ఇదేమి యాశ్చర్యము.

కుశాల్—నాకును వింతగనే దోఁచుచున్నది. కారణ మెంత యోచించి నను తెలియకున్నది.

రామేశ్వ—సేవకా ! నీవిఁక బొమ్ము. (కుశాల్ రావునుజూచి) అయ్యా ! ఇఁక తుకారాముని గ్రంథములను వ్రాయకుండఁ జేయు టెట్లు.

కుశాల్—(యోచించి తనలో) నా మాయ మంత్ర మిప్పుడు ప్రయోగించెద. (ప్రకాశముగా) స్వామీ! నా కొకటి తోఁచుచున్నది.

తే. గీ. తపముఁ జేయుచు నుండెడి • తపసిఁ జెఱప
వార నారుల సురపతి • పంప లేదె
అటుల మనమొక వేశ్యను • పటుతరమునఁ
బంపఁ గావచ్చు నీ కేల • భయము దేవ. 61

రామేశ్వ—అటులఁ జేసిన మర్యాద దక్కదు.
కుశాల్—అదెట్లు?
రామేశ్వ—ఎవరైనఁ జూచిన నెట్లు?
కుశాల్—ఎటులఁ జూతురు?
రామేశ్వ—మనము వేశ్యా గృహామునుండి వచ్చునప్పుడు యెవరి కంటను బడకుందుమా?
కుశాల్—వేశ్య యింటి కేగ వలసిన పని యేమున్నది?
రామేశ్వ—వా రెటుల రాఁగలరు?
కుశాల్—ప్రతి దినమును మన మఠమునకు సర్వహారి పద్మను బిలిచికొని వచ్చుచుండ మీరు చూచుచుండ లేదా?
రామేశ్వ—ఔను వారి కార్యమున కీయ కొందురా?
కుశాల్—ఈ కార్యమున కనిన వారేకాదు, ఇతరులుఁగూడ సమ్మతింపరు. దాని కొక యుక్తిఁ బన్నవలసి యున్నది.
రామేశ్వ—అదేది?
కుశాల్—వారు వచ్చిన తోడనే మీకు పద్మయందు దిష్టము జనించి నటుల సర్వహారికిఁ జెప్పెదను ఆపె పద్మను మన స్వాధీనముఁ జేయును.
రామేశ్వ—అబ్బా! ఆ కార్యమునకు సమ్మతింపను.
కుశాల్—మీరు భయపడనక్కర లేదు. మనకార్యమైన పిమ్మట మరల దానిని వారి యింటికిఁ బంపుదము.
రామేశ్వ—వారి దినమున రారు కాఁబోలు.

కుశాల్—తప్పక వత్తురు. (అటు నిటుఁ జూచి) ఏమిది. అదిగో దూరమున వచ్చుచున్నారు. చూడుఁడు. ఔరా! పద్మ యెంతచక్కఁగ నున్నదో చూడుఁడు.

సీ. ముఖము చక్కఁగ నున్న • ముక్కు వంకర బోవు
ముక్కు బాగుండిన • మూతి సొట్ట
కన్నులు సరియైన • కాంతి విహీనమౌ
కాంతిని గల్గిన • కాళ్ళు సొట్ట
చేతులు సరియైన • చెవులు చేటలఁ బోలు
చెవులు సుందరమైన • చెంప సొట్ట
నడుము సన్నంబైన • నడుగు కొంగను బోలు
నడుగు బాగుండిన • నడత సొట్ట
తే. గీ. చూడ పద్మను సర్వాంగ • సుందరి యగు
బ్రహ్మ బుట్టించె దానిని • వలయు ననుచు
చూడుపచ్చుచు నున్నది • చుక్కఁ బోలి
అట్టి దానిని విడిచెడి • యునద గలఁడె 62

అదే సమీపించిరి. చూడుఁడు.

రామేశ్వ.—(చూచి) అవును. పద్మ సౌందర్య రాశియే యని చెప్పక తప్పదు.

కుశాల్—వారు వచ్చిన మీరు తీర్థమిచ్చి యూరకుండుఁడు. నేనన్నియు మాటాడెద.

ప్రవేశము—సర్వహారి పద్మతో.

సర్వ— } (నమస్కరింతురు.)
పద్మ— }

రామేశ్వ—శుభమగు గాక.

పద్మ—(రామేశ్వర భట్టును సమీపించి దోసిలి యొగ్గును.)

రామేశ్వ—(తీర్థ మియ్యఁగా పద్మ తీసికొనును)

సర్వ—స్వామీ! ఇంక సెలవిండు.

కుశాల్—సర్వహారీ! మీరు వేశ్యలు కదా.

సర్వ—ఔనండీ.

కుశాల్—మీపద్మపై స్వామికి యనురాగము జనించినది. వారి స్వాధీనము చేయుదువా?

రామేశ్వ—(అటునిటుఁ జూచి తనలో) అబ్బో! కొంప తీసెను.

సర్వ—చిత్తము. (పద్మను జూచి) అమ్మా! స్వామిని చేపట్టుము. జన్మ పావన మగును.

పద్మ—(ముఖము చిట్లించి) అమ్మా! గృహమున కేగుదము రమ్ము.

సర్వ—(కుశాల్ రావుతో) మీరు గృహమునకు రండు. దానిని నే నొప్పించెద.

(పద్మ సర్వహరి నిష్క్రమించెదరు)

రామేశ్వ—దివాన్ జీ! పద్మ సమ్మతించ లేదుకదా.

కుశాల్—ఆమె యింకను అభము శుభము లెఱుఁగనిది కదా. ఇచటఁ దన సమ్మతిని జూపునా.

రామేశ్వ—ఇపుడేమి చేయఁ దలఁచితివి.

కుశాల్—ఇంటి కేగి అన్నియు మాటాడి వచ్చెద.

రామేశ్వ—వినక పోయిన భటులచే బలవంతమున యెత్తుకొని రమ్ము.

కుశాల్—(స్వగతము) వీనికి పిచ్చిఁ దలకెక్కించితిని. ఇఁక నాకార్యము నెఱవేఱి నటులే. (ప్రకాశముగా) చిత్తము. మీ యాజ్ఞప్రకారము జరిపించెద. (నిష్క్రమింతురు.)

ఇతి చతుర్థాంకము.

---



# తు కా రాం

## పంచమాంకము

(ప్రథమరంగము.)

ప్రవేశము;—సర్వాహారి పద్మ గృహమునఁ గూర్చుండి యుందురు

సర్వా—అమ్మా! నామాట వినుము. మతగురువును చేపట్టుము. అట్టివారు లభించుట నీవు తొలి జన్మమున నోఁచిన నోముల ఫలమని యెంచుము.

పద్మ—తల్లీ! నే నొల్లను. నీ వంతగ బలవంతముఁ జేయుచున్నావు. ఆయన నన్ను వివాహముఁ జేసుకొనుటకు సమ్మతించిన యెడల ఆయునను చేపట్టుదునే గాని లేకున్న నా పనికి నే సమ్మతింపను.

సర్వా— పద్మా! మతగురు వెప్పుడైన వివాహ మాడునా? అదిమత విరుద్ధముగాదా? లోకులు నిందింపరా?

పద్మ—ఇటుల దొంగతనముగ పరాంగనలఁ బొందుట మత దూష్యము కాదు కాఁబోలు

సర్వా—ఇది లోకు లెఱుంగరు కదా?

పద్మ—ఎన్నిదినములు తెలియ కుండును. నేఁడు కాకున్న యెల్లుండి తెలియదా?

సర్వా—తెలిసిన మన కేమిః భయము మనవృత్తియే యది. ఇఁక అతని సంగతి మన కేల?

పద్మ—ఏమి? అది మనవృత్తియా? అదే నే నొల్లనిది మనవృత్తియ టకు నీ పూర్వు లిదే వృత్తియం దుండిరా?

సర్వ—అది నాకుఁ దెలియదు. ఏది యెటులుండినను ఆయనను చేపట్టుము. నీకు పదుగురిలో గౌరవము కలుగుటయేగాక మనకు ధనము చేకూరును.

పద్మ—అమ్మా! నీవు కుశాల్ రావు ధనమంతయు సంగ్రహించి యొవ పకీరును జేసినను, వాఁడు నిన్ను విడువలేక మతగురువుకడ నేక కావృత్తిఁ జేసి నీ యింటఁ బడి యున్నాఁడు. బంగారు గుప్తను దివాలా తీయించితివి. పాపము. అనుకొనిన జాలికల్గును. అతఁడు బజారున దోసె లమ్ముకొని జీవించు చున్నాఁడు. వారి ధనమంత యు యే మూలన దాఁచితివో నాకుఁ జూపుము.

సర్వ—అదెచ్చట నున్నదే. ఆ నాఁడే సారా దుకాణమును జేసెనది. బ్రాహ్మణుఁ డైనను కుశాల్ రావు సారాయిలేక పోయిన చచ్చును. బంగారుగుప్త మాటఁ జెప్పబనిలేదు వాఁడు మాంసమునుగూడ విడువడు, వారిద్దరుఁ గలిసి నాకు మద్యపానమును నేర్పిరి. ధన మింకెటుల మిగులును.

పద్మ—అదికాదు. మన కులమున యెంతగ గడించినను కడకొక కాసైనను నిలుపదని శాపము కదా?

సర్వ—ఆశాపమిప్పుడు అములులో లేదు. నా మాట వినుము. చెడి పోవకుము.

పద్మ—నేను వివాహ మాడెదను కాని యా నీచ వృత్తికి లోఁబడను.

సర్వ—మాటలతో ప్రొద్దేలఁ గడపెదవే. (ప్రక్కకుఁజూచి) అదిగో వారు వచ్చిరి. ఇఁక నీ యిష్టము.

(నిష్క్రమించును)

పద్మ—దైవమా! నన్నుఁ గాపాడు వారెవరు.

ప్రవేశము—కుశాల్ రావు.

కుశాల్—పద్మా! ఆనాఁడటులఁ జేసితివి. నేఁడేమి చేయుదువు.

పద్మ—ఆనాఁడేమిఁ జేసితినో నేఁడు కూడ నయ్యదియే.

కుశాల్—నేఁడు మతగురువు నిన్నుఁగోరి నందున ధనాపేక్షచే సమ్మతింతువు లెమ్ము.

పద్మ—అయ్యో! మీరు పొరఁబడితిరి.

తే.గీ. భాగ్య మంత నొసంగిన • ఫలము లేదు.
కనక వర్షంబుఁ గురిపింపఁ • గనఁడు మేలు
శేష తల్పంబు చెప్పిన • జెడదుమనసు
నెట్టి మాటలఁ జలించి • నే గౌ బొమ్ము. 63

కుశాల్—ఏమి నావి వెఱ్ఱిమాటలా. ఊరక జెడిపోకుము. మంచిమాట చెప్పిన పెడచెవిని బెట్టుచున్నావు.

పద్మ—అయ్యో! మీ గౌరవమునకు భోఁగొట్టు కొనకుఁడు. మీకు మంచి మాటలుగాఁ దోఁచినవి నాకు చెడ్డవిగాఁ దోఁచ వచ్చును. "లోకో భిన్నరుచిః" అను సూక్తిఁ గదా?

కుశాల్—నిన్నుఁ బట్టి గొంపోయిన నేమి చేయఁ గల దానవు?

పద్మ—(తనలో) వీనికి మంచిమాటలు పనికి రావు. (ప్రకాశముగా) ఛీ! నీచపు మాట లాడకుము. గుణవంతుఁడవని గౌరవించితిమి గాని మ్లేచ్ఛ సమానుఁడ వని తెలియ దయ్యె. అధమా! స్త్రీల జెఱఁ బట్టఁ జూచెదవా?

కుశాల్—పద్మాననా! నన్ను గూరిన నేమి ఫలము నన్నుఁ జూడక పోయినను ఆయన మతగురువు కదా.

పద్మ—మతగురువును గొంపోయి మహాసముద్రమునఁబడఁద్రోయుము. అగ్నికి వాయువు తోడైనటుల యిరువురును బాగున్నారు.

కుశాల్—మంచి మాటలు నీ తల కెక్కుట లేదు. నిన్ను నీ శయ్యతో గొంపోయి మా గురువుకడఁ జేర్చెదఁ జూడుము. (అని సైగఁ జేయ దాఁగి యుండిన నలుగురు భటులు వచ్చి మంచమునకు నాల్గు ప్రక్కల నిలతురు.)

పద్మ—అయ్యో! నన్నుఁ గాపాడు వారెవరు! నా పడక టింట నిన్నెవ్వరుఁ గావఁ గలరు. నా తల్లి నాకిక లోఁబడి యెచ్చటికో వెళ్లినది. వీరు నన్నింక విడుచుట కల్ల.

సీ. ఆకసంబుననుండి • యిన్నిటిఁ దిలకించు
చుక్కలారా! మీరుఁ • జూడ రాదె
ఆకసంబున దాఁగి • యన్నిఁటి గనుచుండు
సూర్యదేవా! నీవుఁ • జూడ రాదె
ఆకసంబునఁజేరి • యన్నిటి వీక్షించు
నాకాశవాణి! నీ • వరయ రాదె
ఆకసంబుననుండి • యన్నిటిఁ బొడగను
సురలార! నావంకఁ • జూడ రాదె
తే. గీ. నన్ను గొంపోవు చున్నారు • న్యాయ మనుచు
సాక్ష్య మివ్వుడు నేఁగోరఁ • జాల సుమ్ము
యముఁడు దండించుతరి మిమ్ము • నడుగుదాన
దప్పు యెవ్వరిదో మీరుఁ • జెప్పవలయు. 54

ఇప్పుడే మిమ్ము సాక్షిఁ గోరుటకు న్యాయాధి పతుల యందు న్యాయ ముండిన గదా; న్యాయశీలురగు మిమ్ముల విచారించుటకు. న్యాయాధి పతులు ధర్మమును గాపాడి దుర్మార్గుల శిక్షించు చున్న మా బోటి యబలల కిట్టి గతి వచ్చి యుండదు కదా. ఔరా! యెక్కడి న్యాయము. మతగురు వేడ నే నేడ.

సీ. మతగురు స త్తముల్ • మందులో టనెగదా
మత గౌరవంబెల్ల • మాయమగుట
బ్రాహ్మణుల్ కొందఱు • భ్రష్టులౌ టనెగదా
కులధర్మ మెల్లను • కూలఁ బడుట
న్యాయాధి కారులు • మాయావు లైగదా
ధర్మముల్ మూలల • దాఁగి కొనుట
వారాంగనలగుంపు • బలిసి నందున గదా
సజ్జను లందఱు • జారు లగుట
తే. గీ. ఇట్టి యవినీతి పరులు తా • మిపుడు బుట్టి
తిరిమినారలు హిందూమ • తంబు నెందో

పరులు గేళ్లేయు చున్నారు • పట్టుఁ బట్టి
యేమి కానున్నదో యింక • యేమి గతియొ 65

సన్న్యాసి సాని పొందుఁ గోరిన యిఁక సామాన్యులనన్న పాపము గదా. స్వాములవారను పేరుఁ బెట్టికొన నేల? ఛీ! పాపాత్మా! నీచేఁ దీర్థముఁ బుచ్చుకొనిన జన్మ జన్మాది నరకము ననుభవించుటయేఁగాక పునర్జన్మము లేదు కదా. కులకలంకా! ఎందఱి కులములఁ జెఱిచితివో కదా. ఓరీ! రామేశ్వరభట్! మొన్న నీవంటి సన్న్యాసి యొకఁడొక విత్తం తువుచే సుఖ మనుభవించు చుండ, చూడఁ జాలక యొకఁడు తన కత్తి కెరఁ జేసినది మఱచితివా. నీ గతి యేమగునో గదా. ఓరా! ఇఁక హిందూ దేశమున హిందూ యువతీ జనంబులకు సుఖము గలుగ వలెనన్న నెట్లుఁ గలుగును. పరనారీరతాగ్నివిదగ్ధా! ఎందఱి పతివ్రతా తిలకములు నీదగ్గరకు తీర్థసేవనమునకు వచ్చినపుడు పట్టి బల వంతమున జెఱిపితివో కదా. మాభరతఖండముతన సహజ గౌరవమును గోలు పోవుచున్నదనుట కిదియొక నిదర్శనము గదా. (అర్థోక్తి)

కుశాల్—(భటులతో) ఓరీ! నివ్వెరపడి చూచుచు నిలచితి రేమి. కానిండు.

సేవకులు—(వంగి మంచము నెత్తఁ బోదురు!

పద్మ—అన్నలారా! మీకు నమస్కరింతును. నా మంచమును గాని నన్నుఁగాని స్పృశించి అపవిత్రను జేయకుఁడు. (నిట్టూర్పు విడచి) దైవమా! వీరింక నన్ను విడుచుట కల్ల. నే నొక్కనిని మాత్రము చేపట్టెదనని కదా నా తల్లితో నంటిని. ఇక్కడ నుండిన పలువురు నన్ను బాధింపు చుందురు. అచటికేగి రామే శ్వరభట్టు నొకనినే నమ్మియుండెద. వీటి కన్నిఁటికిఁ గారణము యీ కుశాల్‌రావే కదా. మా తల్లి మాట విని ఆయన కడఁ జేరి యింతఁ జేసెను. (కుశాల్‌రావుఁజూచి) మీ యిష్టాను సారము గురువును జేపట్టెదను. నడువుడు. (కుశాల్‌రావు సేవ కులు ముందు నడుతురు. పద్మ దుఃఖముచే చిన్నగ వెనుక నడ చుచు) విధి వ్రాసినటులఁ దప్పక జరుగఁ గలదు. లేకున్న

సీ॥ భూమిపై నేనేలఁ • బొలతినై బుట్టితిఁ
బుట్టిన వేశ్యచేఁ • బట్ట నేల ?
బట్టినంతనె తాను • పలువురఁ జేఁబట్టఁ
బతిమాలి బలవంత • పరుప నేలఁ ?
బలవంత పరుపనే • పలుక కుండిన దాను
తీర్థంబు సేవింపఁ • ద్రిప్ప నేలఁ ?
ద్రిప్పిన నేమాయెఁ • దీర్థంబు నిచ్చెడి
గురువు నన్నీక్షించి • కోర నేలఁ ?
తే. గీ. కోర యాతని నిరసించి • పాఱ నేలఁ ?
పాఱ యీకుళాళ్ రావు నన్ • జేర నేలఁ ?
జేరె బలిమిని గొంపోవఁ • జోర నేలఁ ?
జోరె మఱిగురు నేరంగఁ • జోవ నేల ? 66

(నిష్క్రమించును.)

## ద్వితీయ రంగము

ప్రవేశము:—రామేశ్వరభట్టు పద్మతోఁ గూడ శయన గృహమున నుండును.

రామేశ్వ—

సీ॥ చంద్ర బింబము కంటెఁ • బాగుఁ బ్రకాశించు
పద్మ తా బంగారు • పద్మ గాదె
కమల పత్రము మించు • కన్నుల తోఁ నొప్పు
పద్మ తా బంగారు • పద్మ గాదె
మెఱపుఁ దీఁగెను మించు • మేనితో సొంపారు
పద్మ తా బంగారు • పద్మ గాదె
రంభను మఱపించు • రంగుతోఁ జెన్నొందు
పద్మ తా బంగారు • పద్మ గాదె
తే. గీ. చుక్క మెఱుపును మించెడి • సుందరి యగు
పద్మ పద్మయె బంగారు • పద్మ గాక

ముదముఁ గూర్చుచు నుండెడి • మోహిని యగు
పద్మ పద్మయె బంగారు • పద్మ గాక. 67

పూర్వజన్మ సుకృత ఫలము గాకుండిన యీ నారి నా కబ్బునే (అగ్నో ప్రె)

పద్మ—ఔరా! కలికాల మహిమ. ఎంతేలో పిచ్చి తలకెక్కినది. కుశాల్ రావును దగ్గరఁ జేర్చినందున గదా యీయన తన గౌరవమును గోల్పోవుటకు ప్రథమకారణము. మందుడై మాయమాటలకు లొంగినది యితని తప్పే కదా. గుణవంతుఁడే యైయున్న లోఁబడి యుండునా? పాపము.

తే. గీ. మతము బోయిన వెంటనే • మతము మారె
మతముతోఁగూడ శిష్యులు • మాయనైరి
మోహమునఁ జిక్కి స్వామితా • మోసపోయె
వలదు వలదన్న నను వీడఁ • దలఁపఁ డయ్యె. 68

రామేశ్వ—ప్రేయసీ! నన్ను చేపట్టి నందులకు నీకేమైన కొదువఁ జేసితినా? నీ కేమి తక్కువైనను నానఁ జెప్పుము. వెంటనేఁ దెప్పించెదను. (యోచన నభినయించును.)

పద్మ—నా కేమియు నక్కర లేదు. (ముఖము వీక్షించి) ఏమి మీ ముఖము అట్లులున్నది.

రామేశ్వ—ఏమియును లేదు.

పద్మ—నాతోఁ జెప్ప రానంతటి కార్యమా.

రామేశ్వ—నీకుఁ జెప్ప రాని కార్యమున్నదా.

పద్మ—మరి చెప్పక దాఁచెద రేల?

రామేశ్వ—చెప్పెదను. నీవు నన్ను నిక్కముగఁ బ్రేమించుచు చున్నావు గదా.

పద్మ.—మనోహరా! నా యందు మీ కెందులకు అనుమానము కలిగినదో తెలియకున్నది. అందఱి వేశ్యల వలె నన్నెంచకుఁడు. మీ కొఱకై

తే. గీ. అనల మందున నిద్రింపు • మనినఁ బోదు
గాలిమేపరి మెడకు నేఁ • గట్టి కొందు
పెద్దకొండను మూఁపునఁ • బెట్టి కొందు
ప్రాణమడిగిన నిత్తు మీ • పాద మాన. 69

నా మాటలు నమ్ముఁడు. చెప్పినఁ జేయక మానను.

రామేశ్వ—బాగుగ యోచించి చెప్పుము. అదిమిగుల సాహసకృత్యము,

పద్మ—ఏదైన కానిండు. నాకుఁ జెరుపుఁ జేయుకార్యము మీరు మాత్రము చెప్పఁగలరా. ఒకవేళఁ జెప్పినను జేయకఁ దప్పను.

రామేశ్వ—నీ కేమియుఁ బ్రాణభయము లేదు.

పద్మ—అటులైన ద్వరగాఁ జెప్పుడు.

రామేశ్వ—ఏమియును లేదు. తుకారాం భక్తుని నీనెరుఁగుదు కదా.

పద్మ—ఆయన పేరు వినని వారీ ప్రపంచమున నుండరు. ఆయన మహానుభావుఁడు గదా.

రామేశ్వ—తుకారాం! శ్రుతులను స్వభాషలోవ్రాసి జనులకు బోధించు చున్నందున నా గౌరవము తగ్గిపోవుచున్నది. నీ వతనిఁ జేరి యెటుల నైన శ్రుతులను గాల్పించి జారునిగ మార్చి రమ్ము.

పద్మ—అకటా! నే నెంత మోసపోయితిని. ఆ భక్తుని జెనికి నే మనఁగలనా. ఎంత దుష్ట ప్రవర్తన మొనరించినందుననో యీ పాపి జన్మము కలిగినది. మఱల యీ పాప కార్యమును నే నెటులఁ జేతును. ఏ కార్యము నైనను దప్పకఁ జేసెద నని గురువుతోఁ జెప్పితిని. చేయక పోయిన మాట పొల్లుఁ బోవుటయేఁ గాక ఆయనకుఁ గోపము జనించును. ఆయనను పతిగా భావించినందున యీ కార్యముఁ జేయవలసి వచ్చినది. చేయక పోయిన పతికిఁ ద్రోహముఁ జేసిన దాన నగుదును. ఇది పతివ్రతకు దగని పని. కనుక పతి యాజ్ఞ ననుసరించి కార్యమునకు దొరకొనెద. (ప్రకాశముగా) ప్రియా! ఇదేవెళ్ళి నా శక్తినిఁ బ్రయోగించెదను. కార్యమెటుల పరిణమించునో తెలియదు.

(ఇరువురు నిష్క్రమింతురు.)

(ప్రవేశము—తుకారాం గృహమునఁ గూర్చుండి యుండఁ బ్రక్కన
శివాజీ మోకాళ్ళపైఁ గ్రిందఁ గూర్చుండి యుండును.

తుకారాం—నాయనా! తురకల వలన నీ కే విపత్తుఁ గలుగు చుండ
లేదుకదా.

శివాజీ—స్వామీ! మీ యనుగ్రహము నాయందుండ నా కెవరిభీతియుఁ
గలుగదు.

తుకారాం—వత్సా! నా దేమున్నది. నిన్నును నన్నును యీ సకల
ప్రపంచమును గాపాడునది ఆ పాండురంగఁడే గదా.

శివాజీ—సత్యమే. అయిన మీ రానాఁడు పూనానుండి త్వరగఁ బొ
మ్మని నది చాల మంచిది. తురకలు కోటను ముట్టడించి యుం
డిరఁట. స్వామీ! అదే మాశ్చర్యమో నేనేగు తఱికి వారు పాఱి
పోయి యుండిరి. నేను కోటకేగి మా వారిని యుద్ధము చేయ
కనె యెందుల కేగిరి యని యడుగ "మీరు వచ్చి యుద్ధముఁ
జేసినందున కదా వారు పాఱి పోయిరి. మరల యేమిటు లడుగు
చున్నారు" అనిరి. నేను నిక్కముగ యుద్ధ మొనరించియే యుండ
లేదు.

తుకారాం—నాయనా! అది పాండురంగని మహాత్మ్యము. నీవుకోటలో
లేకుండుటఁ గని దుర్గము మహమ్మదీయుల పాలగునని యా రక్ష
కుఁడు నీ రూపముతోఁ బోరి యుండును.

శివాజీ—(ఆశ్చర్యముతో) అయ్యో! నాకు దర్శన మైన నియ్యక పో
యెనే. స్వామీ! నే నేగునపుడు కోటను ముట్టడించినారనియు,
నన్ను త్వరగఁ బొమ్మనియు వ్రాసిన కాగిత మొకటి దొఱికి
నది. ఇదే చూడుఁడు. (అని చూపును)

తుకారాం—(కన్నుల కొత్తుకొని) ఆ మాధవుఁడు వ్రాసినదియే.
నాయనా! నీవు పుణ్యాత్ముఁడవు. అప్పుడప్పుడు వచ్చి నా కగు
పడు చుండుము. పాండురంగని నిరంతరము భజించు చుండుము.
ఇఁక నీ కోటకు వెళ్ళ వచ్చును.

శివాజీ—చిత్తము. (నమస్కరించి నిష్క్రమించును.)

తుకారాం—(జపమాలఁ దీసికొని జపముఁ జేయుచుఁ గూర్చుండి యుండును.)

ప్రవేశము—పద్మ.

పద్మ—(తుకారామును జూచి) ఆహా! ఈ మహా భాగవతోత్తముని జూచిన నా కపరిమితమగు భక్తిఁ గలుగుచున్నదే. ఈ పూజనీయుని బుద్ధిని ద్రిప్ప నాచేత నగునా. ఈ భక్తాగ్రేసరుని గన కుట "కాలితోఁ దలఁ గొట్టుకొను" నట్టిది కదా. ఈ వేదపారాయణుని కడ నా మోసము నిక్కముగ పనికి రాదు. అధిక ప్రసంగముఁ జేసితినా నన్ను మాడ్చి వేయును. (యోచించి) అయిన నీ మహానీ నితో మాటాడు టెట్లు. ధైర్యమున వెళ్లి ముద్దిడుకొనిన మోహ పరవశుఁ డగునా, ఇఁటుల నే బోయి గట్టిగఁ గౌఁగలించుకొనిన మాఱు కౌఁగలి నిచ్చునా. ఇట్టి దెంద్రైనఁ గలదే. ఈభక్త చింతామణియందు మచ్చఁ జూపుట కలవి యగునా. నే నేమి దుర్మార్గమునకు దొరకొనినను చెడుదును. నే నిపు డూరక నమస్కరించెద. (సమీపించి) స్వామీ! నన్నుఁ గాపాడుము. (అని నమస్కరించును)

తుకారాం—(కన్నులఁ దెఱచి) అమ్మా! శుభమగుఁ గాక. తల్లీ! నీఁవేతెంచిన కార్యము కానేరదు. నన్ను జారునిగఁ జేయుటకు గదా నీ వేతెంచినది.

పద్మ—(భయముతో) అబ్బా! అప్పుడే తెలుసుకొని యున్నాఁడే. ఇఁక జచ్చితిని. స్వామీ! ఇందు నాదోష మేమియును లేదు. క్షమింపుడు.

తుకారాం—అమ్మా! ఇందు నీ తప్పు లేశమైనను లేదు. నీవు భయపడకుము. నా గ్రంథములను గాల్చి వేయు నటులఁ జేయుమనిగదా నీకుఁ జెప్పియున్నారు. (అని యొక తులసి పూసల దండను దీసికొని పద్మ మెడయందు వేసి) అమ్మా! నీ మనస్సార్థిగఁ జెప్పుము. వాటిని కాల్చి వేయు మనెదవా.

పద్మ—స్వామీ! వలదు వలదు. అంతటి పాపపు మాటల నేఁ జెప్పఁ జాలను. ఇంతటి నుండియు నాకీ ప్రపంచ సుఖములతోఁ బని లేదు. నన్ను మీ భక్తురాలిగ నంగీకరించుఁడు.

తుకారాం—అట్లనే కానిమ్ము. అమ్మా! (కొన్ని మాలల దీసికొని, ఇది నిన్నుఁ బంపిన రామేశ్వర భట్టు మెడలో వేయుము. (రెండవ దానినిచ్చి) మీ తల్లిమెడలో వేయుము. (మరి రెండిచ్చి) వీనిని నీ యిచ్చ వచ్చిన వారికిచ్చి వేయుము. నీ వింకఁ బోవచ్చును.

పద్మ—(స్వగతము) ఈ మాల వేసి నన్ను భక్తురాలిగఁ జేసెను. తక్కిన వానిని వారి కొఱకై యిచ్చి యున్నారు వారుఁ గూడ నావలెనె మాఱి పోదురు గాఁబోలు. ఇఁక నా దగ్గర రెండు మిగులును. పాపము. వాటిని కుశాల్ రావుకును, బంగారు గుప్తకును వేసెదను.

(నిష్క్రమించును)

# తృతీయరంగము

ప్రవేశము.—రామేశ్వరభట్టు గృహమునం దాసీనుఁడై యున్నాడు.

రామేశ్వ—

తే. గీ. పద్మనంపి తుకారాము • భ్రష్టుఁ జేయఁ
దలఁచితిని గాని కార్యంబు • దాని వలన
సాగునో లేదో కనుఁగొని • శాప మిడెదొ
వనిత రాదాయెఁ దెలియఁగా • వలయు నన్న. 70

(బాగుగఁ జూచి) ఏమిది. వచ్చునది పద్మయేనా? సన్యాసిని వలె నున్నదే. (మరలఁ జూచి) ఔరా! పద్మ కావిగుడ్డల ధరించి తులసి మాలలఁ జేతఁ బట్టికొని వచ్చు చున్నది. కానిమ్ము.

ప్రవేశము—పద్మ మాఱువేసముతో.

రామేశ్వ—పద్మా! నన్ను మోసపుచ్చుటకా యీ వేసము ధరించితివి.

పద్మ—అన్నా! మోస మేమియును లేదు.

రామేశ్వ—(ఆశ్చర్యముతో) మన కార్య మేమాయెను?

పద్మ—అన్నా! ఇఁక ఆ మాటలఁ బలుకకుము. ఆ పాప కార్యమును నీ మదిని దలఁపకుము. మీరు మోహసంభ్రమునఁ బడి కన్నుఁ గాన కున్నారు. దుర్మార్గులకు లొంగి పరస్త్రీనైన నన్నుఁ గోరితివి. నీ మతగురువు పదవిని వదలి గౌరవమును గోల్పోయితివి. దూరాలోచనఁ జేయుము. తప్పుఁ జేసిన వారిని దండించు వారలగు మీరే యిటులఁ జేసిన లోకు లేగతి కావలయును. ఇఁకనైన బాగుగ మెలంగుఁడు. (అని తులసి మాలను మెడను వేయును.)

రామేశ్వ—అమ్మా! నా కిపుడు తెలివి వచ్చినది. నీవు పద్మవు గాదు. నా పాలిటి దేవతవు. నీకిదే ప్రణమిల్లు చున్నాను. ఇంతటి నుండియు నా పూర్వ ధర్మముల నాచరించెద.

తే. గీ. భూరి గుణసాంద్రులార! యో • పూజ్యులార!
ఒకరి యశమును జూచి నే • నోర్వలేక
వేశ్య పానంబుఁ బట్టి నే • వెట్టి నగుచు
కపట మస్కరి బిరుదు నేఁ • గాంచఁ గంటి. 71

“నూరు వ్రతముల ఫలము నొక రంకు బోఁగొట్టె”నన్నట్లు యిన్ని దినముల పుణ్యఫలముఁ గోలు పోతిని. ఆ నిర్వికార నిరామయుని సర్వదా ధ్యానించు తుకారామును జెఱుపఁ బూని సదా కలుషాత్ముఁడనను పేరుఁ గాంచితిని. ఆ మహా భాగుఁడు నన్నపరాధిగా నెంచక ముక్తి మార్గ మీ పద్మవలనఁ గలుగఁ జేసెను. మఱల నా యాశ్రమముఁ జేరెద.

(నిష్క్రమించును)

పద్మ—సోదరీ మణులారా! నేఁ బడిన పాట్లఁ జూచితిరి కదా. గుణవతులకుఁ గీడుఁ గలుగుచునే యుండును. వాని నన్నిటిని సహించిన మేలుగల్గును. దుర్మార్గులు మిమ్ములఁ జూచిన గేలిఁ జేయకుండు నటుల మెలంగుఁడు.

సీ. అత్తగారినిఁగన్న • యారడిఁ బెట్టక
మాతృ భావముఁ జూప • మంచి దమ్మ
సవతి బిడ్డలఁ జూచి • చావఁ గొట్టక తమ
బిడ్డల గాఁజూచి • పెంచ రమ్మ
పనిఁజేయు మనియన్నఁ • బాలుమాలికయని
పొరుగిండ్లఁ జేరఁగా • బోకుఁ డమ్మ
సవతులఁ జూచిన • జాడీలఁ గల్పించి
పరుల నిందకుఁ బాలుఁ • బడకుఁ డమ్మ
తే.గీ. అన్య పురుషుల యందు మీా • రాసఁ గొనక
పతిని దైవంబుగా నెంచి • బ్రతుక రమ్మ
కలియుగంబని కన్నులఁ • గానకున్న
దండ ధరుఁడట్టి మిమ్ములఁ • జెండునమ్మ 72

మీా కింతకంటె మిక్కుటముగఁ జెప్ప టనుచితంబు. నాకింకను బనియున్నది. వెళ్ళెద.

(నిష్క్రమించును)

ప్రవేశము. సర్వాహారి బజారు వీధిన.

సర్వాహారి—హాహాహారీ! కన్నుఁగానక నేనెంతటి పాపకార్యములఁ జేసితిని? ఇకఁ ముందు నేనెట్టి బాధలఁ బొంద వలయునో గదా. ఒకవిధమగు పాపముఁ జేసితినా.

సీ. భూసురోత్తములను • బుగ్గలఁ బిండుచుఁ
బాద సేవకులుగా • బనిచినాను
పగలెల్ల నిద్రించు • పగచువా రలకు నా
చుట్ట ముక్కను నోటఁ • జొనిపి నాను
ధనవంతుఁ డైయున్న • దాక్షిణ్యమును లేక
యింటిలో పనులఁ జే • యించినాను
జడదారి నైనను • చతురుత్వముంజూపి
గడియలో విప్పుఁ జేసి • విడచినాను

తే.గీ. వెంట్రుకలఁగల్గి యుండిన • విధవ వండు
భోజనము జేయ మనవారి • పోగరుఁ బోరఁ
బిండి వంటను నేఁ దిని • పి చినాను
చేయ రానట్టి పనులెన్నొఁ • జేసి నాను 73

ఇన్ని యపచారము లాచరించిన దానిని భగవంతుఁడువిడచునా. ఇవి యన్నియుఁ జూచుచు యింకను దెలివి లేక మా తెగవారందఱు తమ నీచవృత్తి మానకున్నారు.

సీ. ఒకనినమ్మించి మ • రొకనిని బొంకించి
సంసారములఁ గూల్చు • సాను లార!
బీద బిడ్డలఁగొని • పెద్ద సానులఁ జేసి
జీవనంబును జేయు • చెడిపెలార;
వాకిట నిలిచియు • బాజారునం బోవు
పురుషులఁ బిలిచెడి • పొలఁతులార
మాయ మాటలఁ జెప్పి • మరులు మందులఁ బెట్టి
ప్రాణముల్ దీసెడి • భామలార!
తే.గీ. పాడు వృత్తిని మీరలు • వదలరమ్మ!
పేరణయం బాడి సుఖమును • బడయరమ్మ!
అవని సాధ్వీమ తల్లుల • నరయరమ్మ!
సత్య మిది నమ్మరమ్మయో • సానులార! 74

మానావమానములను గొంచ మేనియు సరకుఁ జేయరుగదా. మన్మథునిబోలు యువకు లందఱును సుఖరోగముల కెఱయై పరలోక మున కేగుటకుఁ బ్రధమకారణము మీరలేకదా. గరితలకు పరపురుషుల నీక్షించుట దూష్యమైయుండ మీరు కావలయునని శృంగారించుకొని సంధ్యవేళఁ బనిలేకుండినను, తలవాకిట గూర్చుండి కోడిగము లాడు చుండుటఁ జూడ నిందాపాత్రము గాదని యెంచితిరా. ఇంటి నుండిబయి టికిఁబోయిన ప్రతివాఁడును మిమ్ముఁ గేలిజేయుటకు గారణ మూహించితి రా. ఇన్నిటికిమూలము మీ నీచవృత్తిగాక మ తొదియుఁ గాదు. మీ రక్షనముఁ జేయుకార్యములకు జ్ఞానాధికులు చేయూత యొసఁగు

చుండినందున మీరింకను పాపభూయిష్ఠు లగుచున్నారు. మీరొనరించు కార్యములను నింద్యములని తగు సవరణఁ జేయక, సజ్జనులమని పేరుఁగొన్న వారు మీకంటెమందబుద్ధిఁ గలవారై వివాహములయందును, దేవుని యుత్సవముల వేళలను, మిమ్ములఁ బిలిపించి కొంత సన్మానించుచున్నందున గదా మీరింకనుఁ జెడుచుండుట. అమ్మలారా! చెప్పఁదొడఁగిన నెంతయో గలదు. మీ రాచరించు కార్యములలో మూఁడు భాగములు నిందా పాత్రములై యున్నవి గాన; మీ రా నీచవృత్తుల మాని యందరి వలెనే గౌరవమును బడయుటకుఁ బ్రయత్నింపుఁడు. నా గతిఁ జూచుచు మరల గోతిలోఁ బడకుఁడు. నా మాటల మఱువకుఁడు మీ కిదే నా కడ నమస్కృతులు.

(నిష్క్రమించును.)

ప్రవేశము:—కుశాల్‌రావు తులసిమాల వేసుకొని.

కుశాల్—

తే. గీ. మేడి పండును బోలెడి • మేని దనక
జాతి రత్నమటంచు నే • సర్వహానిని
దలఁచి మనమునఁ జెడిపోతిఁ • దెలివి లేకఁ
బాపి నేఁ గాక యొరుఁడింక • వసుధఁ గలఁడె, 75

తే. గీ. మోహ సంద్రమునంబడి • మునుఁగు చుండ
నావయై వచ్చి పద్మ తా • నన్ను బ్రోచి
జన్మ సాఫల్యముం జేసి • చనఁగ గఁటిఁ
జేతు దండము పద్మకుఁ • జేతు లెత్తి. 76

నాకీ ప్రాప్తి గలుగునని యొకరైన దలఁచి యుండలేదు గదా. నన్నితరు లెంత హీనముగఁ జూచినను నా పాడుబుద్ధి మఱల కుండెను. సోదరులారా! వేశ్యాలోలుఁడనై యొనరించిన నీచ సాహసములఁ గన్నులారఁ జూచి యున్నారు గాన మరలఁ జెప్పఁ బనిలేదు. మీరు నా గతిఁ జూచుచు మరలఁ జెడు మార్గమునఁ బోనేల? నేఁ జెప్పు మంచి మాటలను వినుఁడు. అటులనిన నీ వేమి మంచి గుణములు కలవాఁడవా? మాకు నీతి నేర్పుట కని యధిక్షేపింపకుఁడు. నేను చెడి

పోయి నందున మీరును నానలెనే చెడిపోదురనియు ముందే మేలుకొని గుణవంతు లనిపించుకొనవలయు ననియు నా కోరిక. కనుక

సీ. సంసారమును వీడి ♦ సాని కొంపలఁ జేరి
సారాయమున్ద్రోలు ♦ చవటలార!
పడతిని విడనాడి ♦ పణ్యాంగనలఁ గూడి
మధు మాంసములఁ దిను ♦ మందులార!
భోగంపు పడతుల ♦ మోహంబు చేవారి
యన్నంబులను దిను ♦ యధములార!
వేడుక యనుచును ♦ వెలయాండ్ర వెనువెంటఁ
బలుమాఱుఁ దిరిగెడు ♦ తులువలార!
తే. గీ. పడపుఁ గత్తెల విషయమై ♦ బలుకు వాఁడ
ప్రేమ యనునది యుండ దే ♦ రోమ మందు
సాని వలలోద గుల్కొని ♦ సమసి పోక
వెలికి రాఁజాల రిదిసత్య ♦ మిలను వినుఁడు. 77
(కలియుగదర్పణము)

(ప్రక్కనఁజూచి) ఓహో! బంగారుగుప్త వచ్చినటు లున్నది. వాని గతి యేమైనదో విచారించెద.

ప్రవేశము:—బంగారు గుప్త పెసరట్లు తట్టఁ జేత నిడుకొని మెడలోఁ దులసిమాల ధరించి.

బంగారు—

సీ. పత్ని యాభరణాల ♦ పడపు కత్తెలకిచ్చి
చెడిపోవు చుండెడి ♦ చెనటులార!
పెద్దల యాస్తినిఁ ♦ బెరటి ద్రోవను దెచ్చి
వెలయాండ్ర కిచ్చెడి ♦ వెఱ్ఱులార!
సత్రముల్ దెగనమ్మి ♦ సానికొంపలఁ జేరి
మాన్యా లొసంగెడి ♦ మనుజులార!
ధనమెల్లఁ గోల్పోయి ♦ మనలేక పురిలోన
భిక్షాటనముఁ జేయు ♦ బేలలార!

ఆ. వె. వేళ కొక్క సొగసు • వేశ్య జేయుచు నుండుఁ
దెలివి లేక దాని • వలను మీఱుఁ
బడకుఁడయ్య మీకుఁ • బదివేల దండముల్
బెట్టుచున్న వాఁడఁ • బ్రేమతోడ. 78

(కలియుగదర్పణము)

తే. గీ. గడన కత్తెలమోసమున్ • గడవలేకఁ
జెడుచు నుండఁగఁ బద్మ సఖ • జేసి బ్రోచె

కుశాల్—సోదరా! యామెయే నన్ను • సుజనుఁ జేసె
మరువఁ జాలను పద్మను • మరువఁ జాల 79

బంగారు—(ఆశ్చర్యముతో) ఏమి నిన్నుగూడ గుణవంతునిగా నొనరించెనా? ఎటులఁ జేసెను.

కుశాల్—ఇదిగో ఈ తులసిమాల వేసినంతటనే నా బుద్ధి మాఱినది.

బంగారు—నాకుఁ గూడ నొక్క మాల వేసెను. వెంటనే నా పూర్వగుణము లన్నియు మాయ మాయెను.

కుశాల్—ఆమెకా ప్రభావ మెటులఁ గల్గినదో యత్యద్భుతముగ నున్నది. కులమున వేశ్యయైనను గుణమున నసమానురాలుగ నున్నది.

బంగారు—ఆమె దేమున్నది. తుకారామస్వామి యామె నార్తిగఁ జేసి కొన్ని తులసిమాలల నిచ్చెనఁట. ఆమె వానిని మన కొసంగి పుణ్యముఁ గట్టికొనెను.

కుశాల్—అన్నా! అట్టి తుకారామునకు నేను మిక్కిలి ద్రోహముఁ గావించి యున్నాను. అతఁడు గనఁబడిన పాదపాములపైఁ బడి మన్నింపఁ బ్రార్థించెద.

బంగారు—ఆయనను దర్శించుటకే నే నేతెంచితిని. తుకారా మిచ్చటికే తెంచునని వింటిని.

కుశాల్— అటులనా (అర్ధోక్తి.)

(తుకారాం లోపల ధరాతలంబున అనుగేయమును బాడును)

బంగారు—మిత్రమా! అదిగో తుకారాం ప్రవేశించు చున్నాఁడు.

ప్రవేశము:—తుకారాం.

గేయము.

ధరాతలంబున మురారీ నీ ప్రజ • దురాత్ములై చెడు చుండగా
బిరాన నీ కని కరాన వారిని • వరా లొసంగియు బ్రోవరా.

కుశాల్ }
బంగారు } (పాదములపైఁ బడుదురు.)

తుకారాం—నాయనలారా! శుభమగుఁగాక. లెండు. నాకు నమస్కరించిన బ్రయోజన మేమి. ఆ పాండురంగని నిరంతరధ్యాన మొనరించు చుండుఁడు. శుభమగును.

కుశాల్ }
బంగారు } చిత్తము.

భరతవాక్యము.

సీ. భక్తులఁ జెఱిపెడి • భ్రష్టులు లేకుండ
భరత ఖండం బిల • బ్రబలుఁ గాక
కపట సన్యాసులఁ • గానరాకుండంగ
భరత ఖండం బిలఁ • బ్రబలుఁ గాక
విటుల నీ భువియందు • వెదకిన లేకుండ
భరత ఖండం బిలఁ • బ్రబలుఁ గాక
ఆటకత్తియలిల • నగుపడకుండంగ
భరత ఖండం బిలఁ • బ్రబలుఁ గాక
తే. గీ. సంఘ లోపము లెల్లను • సమయుఁ గాక
ఆయురారోగ్య భాగ్యము • లలరుఁ గాక
భారతీయుల కష్టముల్ • బాయుఁ గాక
భారతాంబకు బంధముల్ బాయుఁ గాక. 80

ఇది పంచమాంకము.

సంపూర్ణము.

# తుకారాం

(అయిదంకములు నాటకము)

ఇది పురాణ సంబంధమగు నాటకరాజము. భక్తిరసము వెల్లి విరియుచున్నది. తుకారాంభక్తియు, శ్రీశివాజి శౌర్యమును, సర్వోత్తమ చతురబుద్ధి, పద్మపాతివ్రత్యము చదివితీరవలయును. అచ్చుయి సిద్ధముగ నున్నది, వెల రు 12 అణాలు మాత్రమే.

గ్రంథకర్త:— కలవటాల జయరామారావు.

---

# గండికోట వినాశము

(THE FALL OF GANDIKOTA.)

త్వరలో వెలువడును. త్వరపడుడు.

అయిదంకముల చరిత్రాత్మక నాటకము. తాళికోట యుద్ధము ముగిసిన తర్వాత జరిగినకథ. కథాకల్పనము బహుచక్కగనున్నది.

గ్రంథకర్త:— కలవటాల జయరామారావు.

తయారగుచున్న గ్రంథములు.

---

# గోలకొండ పతనము

ఇందలి కథ గండికోట వినాశము ముగిసినప్పటినుండి ప్రారంభమైనది. చదివితీరవలసిన నాటకము.

---

# ప్రేమలేఖ

(LOVE LETTER.)

ఇది ఒకానొక పురుషుడు తన ప్రియురాలికి వ్రాసినటుల వ్రాయబడిన చిన్న పద్యకావ్యము. శృంగార రసోపేతము. చక్కని పద్యములు గలవు.